# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.




వస్తున్నది

1965 జులై నుంచి

# 'చందమామ' చందా మార్పు

ఈనాడు అధిక పన్నులు, సుంకములు వగైరాల మూలకంగా ఏర్పడిన ధరల పెరుగుదలతో బాటు 'చందమామ' ప్రచురణలో వ్యయం పెరిగింది. ఇందువల్ల జులై 1965 సంచిక నుంచి 'చందమామ' వెల 75 పైసలకు తప్పనిసరిగా పెంచవలసి వచ్చింది.

| విడి సంచిక | | సాలు చందా | | రెండేండ్లకు |
|---|---|---|---|---|
| **0-75** పైసలు | ★ | రు. **8-40** | ★ | రు. **15-60** |

ప్రస్తుత చందాదారులకు ఈ మార్పు వర్తించదు. కాని, చందా గడువు తీరినవెంటనే చందాను మరల పొడిగించేటప్పుడు కొత్త రేటు ప్రకారము పంపవలెను.

ఎప్పటివలెనే మన 'చందమామ' పాఠకుల ఆదరాభిమానాలను పొందగలదని ఆశిస్తున్నాము.

—ప్రకాశకులు

చందమామ

ఇప్పుడు **6** భాషలలో ప్రతినెలా వెలువడుతున్నది :

తెలుగు - కన్నడము - తమిళము

హిందీ - మహరాష్ట్ర - గుజరాతీ

★

చందమామ నెలనెలా 2,50,000 గృహాలను అలంకరిస్తుంది

★

మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచారసాధనం

వివరములకు :

చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.

25 సంవత్సరాలుగా పేరు మోసింది




సోలు డిస్ట్రిబ్యూటర్లు:
జె. ఎల్. మోరిసన్
సన్ & జోన్స్
(ఇండియా) ప్రైవేట్ లి.
బొంబాయి, ఢిల్లీ,
మద్రాను, కాన్పూరు,
కలకత్తా.



Asha




ఆశా స్నో, ఫేస్ పౌడర్, కుంకుం, కాజల్ తదితర సౌందర్య సాధనాలు

Unique-M-2-TG



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల "ప్రపంచపు వింతలు" శీర్షిక కింద ప్రచురించిన యున్‌కాంగ్ గుహలు చీనాదేశపు అజంటా-ఎల్లోరా లనటానికి సందేహం లేదు. 15 శతాబ్దుల నాడు అసంఖ్యాకులైన శిల్పులు చెక్కిన ఈ గుహలలో అసంఖ్యాకమైన బుద్ధ విగ్రహా లున్నాయి. ఒక్క గుహలోని నాలుగు గోడల మీదనే 10 వేల బుద్ధ విగ్రహాలున్నాయి. ఈ గుహల లోని బుద్ధ విగ్రహాలలో కొద్ది అంగుళాల ప్రమాణం మొదలుకుని 50 అడుగుల ఎత్తు గలవి కూడా ఉన్నాయి. ఒక గుహలో బుద్ధుడి జీవిత మంతా చిత్రించి ఉన్నది. ఈ గుహలలో బుద్ధుడికీ, బోధిసత్వులకూ సంబంధించిన శిల్పాలే గాక, ఆకాశంలో ఎగిరే అప్సరసలూ, పక్షివాహనా రూఢుడైన పంచముఖ దేవుడూ, ఏనుగులూ, వాద్యగాళ్ళూ మొదలైన శిల్పాలు కూడా ఉన్నాయి.

సంపుటి: 36 - మే 1965 - సంచిక: 5

CHITRA



# భారత చరిత్ర




రాజపుత్ర సంస్థానాలన్నీ ఒకటొకటిగా అక్బరు పాదుషాకు పాదాక్రాంతమైపోగా, మేవాడ్ ఒక్కటే లొంగ నిరాకరించింది. ఉదయసింహుడు తన రాజధానిని కోల్పోయినా స్వేచ్ఛను కోల్పోలేదు. 1572 మార్చి 3 న అతను ఉదయపూరుకు 19 మైళ్ళ దూరాన గోగుందా అనే చోట చనిపోయాడు. ఆ తరవాత మేవాడ్‌కు అతని కొడుకు ప్రతాపుడు సాటిలేని నాయకత్వం వహించి, తన వంశానికి ఎలాటి కళంకమూ రాకుండా మొగలులను తీవ్రంగా ప్రతిఘటించాడు. అతని ప్రతిఘటన అత్యంత కష్టసాధ్యమైనది. అతనికా రాజధాని లేదు, చెప్పుకోదగిన సహాయం లేదు; అతని ప్రత్యర్థి "ప్రపంచ మంతటికీ అద్వితీయ సంపన్నుడైన" ఢిల్లీ పాదుషా!

1576 ఏప్రిలులో మొగలు సైన్యాలు అంబరు రాజైన మానసింహుడి నాయకత్వానా, ఆసఫ్ ఖాన్ నాయకత్వానా ప్రతాపుడి రాజ్యంపై దాడి చేశాయి. గోగుందా సమీపంలో హల్దిఘాట్ కనుమ వద్ద ఘోరమైన యుద్ధం జరిగింది. అందులో ప్రతాపుడు ఓడిపోయాడు. ఆ యుద్ధంలో ప్రతాపుడు చనిపోయి ఉండవలసిందే; కాని ఝాలరాజు తానే రాణా నని ప్రకటించి శత్రువులను తన పైకి కేంద్రీకరించు కోవటంతో ప్రతాపుడు ప్రాణాలతో బయట పడగలిగాడు. అతను ప్రసిద్ధమైన తన "చైతక్" అనే గుర్రం మీద కొండల్లోకి వెళ్ళిపోయాడు. అతని దుర్గాలు ఒకదాని వెంబడి మరొకటి శత్రువులకు చిక్కిపోయాయి. అంత దుర్దశలోనూ ప్రతాపుడు శత్రువుకు లొంగిపోయే మాట తలపెట్టలేదు. తనను వేటకుక్కల్లాగా, విడవకుండా వెన్నాడే శత్రువులకు అందకుండా అతను ఒక కొండ నుంచి మరొక కొండకు

మారుతూ, వన్యఫలాలతో తన కుటుంబాన్ని పోషించాడు. తరగని పరాక్రమంతో అతను శత్రువుతో యుద్ధాలు చేసి తన దుర్గాలలో చాలా భాగం తిరిగి స్వాధీన పరుచుకోగలిగాడు. ఈ పోరాటాలను అతను జీవితాంతం వరకూ కొనసాగించి, 1597 జనవరి 19న తన 57వ ఏట మరణించాడు.

రాణాప్రతాపుడు భారత చరిత్రకు చెందిన అద్భుత వ్యక్తులలో ఒకడు. రాజపుత్రులలో అతన్ని మించగల రణకుశలులూ, పరిపాలనా దక్షులూ ఉండిన మాట నిజమేగాని, శౌర్య పరాక్రమాలలోనూ, దేశభక్తిలోనూ, అతనికి సాటి రాగలవాడు మరొకడు లేడు.

అక్బరు అనారోగ్యం కారణంగా మేవాడ్ పై మరి యుద్ధం చెయ్యలేదు. కాని అప్పటికే ఆయన అనేక ఇతరప్రాంతాలు జయించాడు. వాటిలో చరిత్ర ప్రాముఖ్యం గలది గుజరాతు పై విజయం. ఓడరేవుల వల్లా, వర్తక సౌకర్యాల వల్లా గుజరాతు ఢిల్లీ పాదుషాలను మొదటినుంచీ ఆకర్షిస్తూనే వచ్చింది. గుజరాతుకు నామ మాత్రపు రాజుగా వుండిన మూడవ ముజఫర్ షా అయోగ్యుడు. 1572 లో అక్బరు గుజ



రాతు పై స్వయంగా దండయాత్ర నడిపి, యుద్ధాలలో విజయం పొంది, గుజరాతు రాజుకు భరణం ఇచ్చి తొలగించాడు. సూరత్ నగరం ఒకటిన్నరమాసాల ముట్టడి అనంతరం, 1573 ఫిబ్రవరి 26న అక్బరు వశమయింది. ఈ సమయంలోనే పోర్చుగీసు వారికి అక్బరుతో పరిచయం ఏర్పడింది; వారతని మైత్రి వాంఛించారు.

అయితే అక్బరు తన కేంద్రమయిన ఫతేపూర్ సిక్రీకి తిరిగి వెళ్ళగానే గుజరాతులో తిరుగుబాట్లు తలఎత్తాయి. అతని మనుష్యులే అందులో పాల్గొన్నారు. అక్బరు మండిపడి, 600 మైళ్ళ దూరం పదకొండు

రోజుల కాలంలో ప్రయాణించి అహమ్మదా బాదు చేరుకుని, తిరుగుబాట్లన్నిటినీ పూర్తిగా అణచివేశాడు. 1573 సెప్టెంబరు ఆరంభం నుంచి గుజరాతు మొగలు సామ్రాజ్యంలో అంతర్భాగ మయింది. ఇందువల్ల, రాజ్యానికి ఆర్థికంగా చాలా లాభించింది. మొగలులకు పోర్చుగీసు వారితో సంబంధాలు ఏర్పడటమే గాక సామ్రాజ్యానికి సముద్రతీరపు రేవులు లభ్యమయాయి. అయితే మొగలులు నౌకాబలాలను సృష్టించుకునే ఆలోచన తలపెట్ట లేదు. ఈ కారణం చేతనే పాశ్చాత్యులు సులువుగా భారతదేశం లోకి చొరబడ గలిగారు.

గుజరాతు అనంతరం బెంగాలు అక్బరు వశమయింది. బెంగాలు పాలకులయిన సూర్ వంశపు రాజులు ముహమ్మద్ ఆదిల్‌షా పాలించే కాలంలో స్వాతంత్ర్యం ప్రకటించి 1564 దాకా పాలించారు. అటు తరవాత బిహారు గవర్నరు బెంగాలు పరిపాలన కూడా తన వశం చేసుకున్నాడు. 1572 లో ఈ గవర్నరు (సులేమాన్) చనిపోగా అతని కొడుకు దావూద్ అక్బరుకు ఎదురు తిరిగి ఆయన ఆగ్రహానికి గురి అయాడు. 1574 లో అక్బరు ససైన్యంగా బెంగాలుకు వచ్చి దావూద్‌ను తొలగించి, మునిమ్ ఖాన్ వెంట తన బలాలను బెంగాలులో ఉంచి వెళ్ళిపోయాడు. దావూద్ ఒరిస్సాకు చేరుకుని, 1575 మార్చి 3 న సువర్ణరేఖా నదీ తీరాన మొగలు సైన్యాలతో యుద్ధం చేసి ఓడాడు. అయితే మునిమ్‌ఖాన్ మెతకదనం చేత అతను ఓడి కూడా శిక్ష పొందక, ఆ ఏడు అక్టోబరులో బెంగాలును తిరిగి జయించ బూనుకున్నాడు. చివరకతను 1576 జులైలో రాజమహల్ వద్ద జరిగిన యుద్ధంలో ఓడి చనిపోయాడు. అయితే 1592 వరకూ బెంగాలులో కొందరు స్థానిక పరిపాలకులు మొగలు పరిపాలనను ప్రతిఘటించుతూనే వచ్చారు.



# నేహ్రూ కథ

## 11

తొలి రోజుల్లో జవాహర్ రాజకీయాలు కేవలమూ మధ్య తరగతి రాజకీయాలు. నిజానికి ఆ రోజులలో రాజకీయ చైతన్యం మధ్య తరగతి నుంచే వచ్చింది. రాజకీయ వాదులలో మితవాదులైనా, అతివాదులైనా మధ్య తరగతికి చెందిన వారే. అందుచేత జవాహరుకు పారిశ్రామిక కూలీలను గురించీ, రైతు కూలీలను గురించీ ఏమీ తెలియదు.

ఈ స్థితిలో అతనికి తలవని తలంపుగా రైతు వర్గంతో సంపర్కం ఏర్పడింది. అది ఈ విధంగా జరిగింది.

జవాహర్ తల్లీ, భార్యా కూడా జబ్బుగా ఉండటం చేతా, మోతీలాల్ ఒక పెద్ద కేసులో నిమగ్నులై ఉండటం చేతా, జవాహర్ 1920 మే ఆరంభ దినాలలో వారిని మసూరీ తీసుకుపోయి, సెవోయ్ హొటలులో దిగాడు.

ఆ కింద టేడు అఫ్ఘానిస్తానంతో బ్రిటిషు వారొక యుద్ధం చేశారు. ఉభయ పక్షాల వారూ సంధి సంప్రతింపులు జరిపిన సందర్భంలో అఫ్ఘాన్ ప్రతినిధులు సెవోయ్ హొటల్లోనే దిగి ఉన్నారు.



జవాహర్ వారిని గురించి ఆసక్తి పడలేదు, వారిని చూడలేదు, ఒకవేళ చూస్తే గుర్తించలేదు.

అలా ఒక నెల గడిచాక అకస్మాత్తుగా ఒక నాటి సాయంకాలం పోలీసు సూపర్నెంటు వచ్చి జవాహర్‌కొక ఫర్మానా చూపాడు: అతను అఫ్ఘాను ప్రతినిధులతో ఎలాటి సంబంధాలూ పెట్టుకోనని జవాహరును హామీ ఇవ్వమని కోరుతూ స్థానిక ప్రభుత్వం ఆ ఫర్మానా జారీ చేసింది.

హామీ ఇవ్వటం వల్ల జవాహరుకు కలిగే నష్ట మేమీ లేదు. కాని ఎలాటి హామీ లివ్వటమన్నా అతనికి మంట; అందుచేత



హరు తల్లికి జబ్బు మరింత అయింది. తండ్రి కొడుకు లిద్దరూ మసూరీకి ప్రయాణ మయారు. ఆ సమయంలోనే, జవాహరు పైన ప్రయోగించిన నిషేధపు టుత్తరువును ఉపసంహరిస్తున్నట్టు ప్రభుత్వం నుంచి ఉత్తరం అందింది.

వారు మర్నాడుదయానికి మసూరీ చేరే సరికి హొటలు అవరణలో ఇందిరను ఎత్తుకుని అఫ్ఘాన్ ప్రతినిధి ఒకడు కని పించాడు. జవాహరు పై నిషేధపు టుత్తరువు ప్రయోగించినట్టు పత్రికలలో చదివి అఫ్ఘాను ప్రతినిధి వర్గ నాయకుడు జవాహరు తల్లికి రోజూ పూలూ పళ్ళూ పంప నారంభించాడట.

ఒక రిద్దరు ప్రతినిధులు మోతీలాల్ జవాహర్‌ల పరిచయం చేసుకుని, వారిని అఫ్ఘానిస్తానుకు రావలసిందిగా అహ్వానించారు కూడా.

మసూరీ నుంచి పంపెయ్యబడిన తర వాత జవాహర్ రెండు వారాలపాటు అలహాబాదులో ఉండి, ఆ సమయంలోనే కిసాన్ ఉద్యమంలో చిక్కుకున్నాడు. క్రమంగా అతనా ఉద్యమంలో మరింత లోతుగా దిగబడిపోయాడు. దాని మూలాన అతని దృక్పథంలో చాలా మార్పు వచ్చింది.

ఓతను సూపర్నెంటుతో ఇవ్వన నేశాడు. జిల్లా మేజిస్ట్రేటును చూడమన్నారు. జవాహర్ తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు. దాని ఫలి తంగా అధికారు లతన్ని ఇరవైనాలుగు గంటలలోగా డేహరాడూన్ జిల్లా దాటి వెళ్ళి పొమ్మని ఉత్తరువు చేశారు. అంటే కొద్ది గంటలలో అతను మసూరీ విడిచి పోవా లన్నమాట.

మోతీలాల్ ఆ రాష్ట్ర గవర్నరును కొద్దిగా ఎరుగును. తన కొడుకు పైన అలాటి ఫర్మానా జారీ చేసినవాడి బుద్ధిలేని తనాన్ని గురించి అయన గవర్నరుకు రాశాడు. రెండు వారాల అనంతరం జవా

1920 జూన్ ఆరంభంలో రెండు వందల మంది కిసానులు ప్రతాప్‌ఘర్ జిల్లా మధ్య ప్రాంతం నుంచి యాభై మైళ్ళు "యాత్ర" చేసి అలహాబాదు వచ్చారు. తమ కష్టాలను పెద్ద పెద్ద రాజకీయ వాదులతో మొర పెట్టుకోవాలని వారి ఉద్దేశం.

ఈ కిసానులు యమునా తీరాన తిష్ఠ వేసి ఉన్నారని విని జవాహర్ కొందరు మిత్రులతో వారిని చూడ బోయాడు.

"మీరు మా వెంట వచ్చి మా పరిస్థితులు చూసి, మమ్మల్ని కాపాడాలి. మేము అలహాబాదు వచ్చినందుకు అధికారులు మా మీద పగ తీర్చుకోకుండా చూడాలి," అని కిసానులు గోల పెట్టారు. వాళ్ళు జవాహర్‌ను పట్టుకుని వదిలిపెట్టలేదు.

అతను కొందరు అనుచరులతో ఒక కుగ్రామానికి వెళ్ళి అక్కడ మూడు రోజులున్నాడు. అది రైలుకు చాలా దూరాన ఉన్నది. ఆ గ్రామానికి కంకర రోడ్డయినా లేదు. గ్రామీణులలో ఒక వింత అయిన ఉత్సాహోద్రేకాలు కనిపించాయి. నోటి కబురు వెళితే చాలు వేలాది జనం పోగయే వారు. కబురు ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి రెక్కలు కట్టుకు వెళ్ళేది. గ్రామాల నుంచి ప్రజలు ఆబాలగోపాలం



బయలుదేరి, చేలకు అడ్డంపడి మీటింగు జరిగే చోటికి వచ్చేవారు. ఒక్కొక్కసారి "సీతారాం!" అన్న కేక బయలుదేరి, గ్రామ గ్రామానా మారుమోగేది. అప్పుడు కూడా జనం కదిలి మందలు మందలుగా వచ్చేవారు. ఒక్కరి ఒంటి మీదా చింకి పాతలు తప్ప ఉండేవి కావు. కాని వారి ముఖాలలో ఏదో ఆనందం—తమ దుర్భర జీవితం మారిపోయి మంచి రోజులు వస్తున్నా యన్న ఆశ—తొణికిసలాడేది; వారి కళ్ళు మెరిసేవి. ఆ కిసానుల ప్రాణానికి జవాహర్, అతని మిత్రులూ తమను ఉద్ధరించ వచ్చినవాళ్ళు!

వారు తమపై చూపిన ప్రేమాభిమానాలు చూసి జవాహర్ సిగ్గూ, విచారమూ చెందాడు. తన నాగరిక జీవితమూ, సంకుచిత రాజకీయాలూ తలుచుకుంటే సిగ్గయింది. కట్ట బట్ట లేని ఈ భరతమాత బిడ్డలనూ, వారి సంఖ్యనూ తలుచుకుంటే అతనికి కడుపు తరుక్కుపోయింది. భారత దేశం ఆకలితోనూ, దారిద్ర్యంతోనూ అలమటిస్తూ అతని మనో నేత్రానికి పొడగట్టింది. ఈ పేద ప్రజలు తన యందు ఉంచిన విశ్వాసం చూస్తే, తన బాధ్యత అర్థమై అతను భయపడ్డాడు.

వాళ్ళు చెప్పుకున్న విషాద గాథ అంతు లేనిది—నానాటికీ అధికమవుతున్న పన్నుల భారం, అక్రమ వసూళ్ళు, పొలాల నుంచీ, మట్టి గుడిసెల నుంచీ బేదఖళ్ళు, తన్నులు; జమీందార్ల ఏజంట్లూ, బాకీదార్లూ, పోలీసులూ వారిని రాబందుల్లాగా పొడుచుకు తింటున్నారు; రోజల్లా ఒళ్ళు విరుచుకు పని చేసి పండిస్తే, పంట వారిది కాదు, వారికి మిగిలేది కాలే కడుపులూ, తన్నులూనూ. వారిలో కొంత మందికి బెత్తెడు పొలం లేదు, పూరి గుడిసె అయినా లేదు. బంగారం పండే భూమి. అయితేనేం? రైతు వత్తిడి జాస్తి. భూస్వాములు కవుళ్ళను ఎంతకని పెంచుతారు? అది సాధ్యం కాక అక్రమ వసూళ్ళకు దిగుతారు. గత్యంతరం లేక వాటన్నిటికీ తల ఒగ్గి రైతు భూమిని మక్తాకు తీసుకుని, అప్పుల పాలై, ఉన్నది కూడా పోగొట్టుకుని భూమి మీద నుంచి వెళ్ళగొట్టబడతాడు.

అనాదిగా సాగుతున్న ఈ దురన్యాయం మూలాన కిసాను తరగతి దారిద్ర్యం వాత పడిపోయింది. చివరకు పాపం బద్దలయింది. 1920-21 లో రామచంద్ర అనే మరాఠీ కిసాను నాయకత్వాన ప్రతాప్‌ఘర్, రాయ్ బరేలీ, ఫైజబాద్ జిల్లాలలో కిసానులు చైతన్యం పొందారు.






## 12

విమల వెళ్ళిపోయాక తిలోత్తమ ఏమేమిటో ఆలోచిస్తూ ఒంటరిగా తన గదిలో కూర్చుంది. జగతసింహుడు ఈ కోటలోనే ఉన్నాడనీ, క్షేమంగానే ఉన్నాడనీ విమల ద్వారా ఆమె తెలుసుకుని ఉన్నది. మాటిమాటికీ ఆమె ధ్యాస అతని పైకే పోతున్నది.

ఆమె ఇలా ఆలోచిస్తూ ఉండగానే అర్ధరాత్రి అయింది. తిలోత్తమ చుట్టూ జాగ్రత్తగా కలయజూసుకుంటూ అంతఃపుర ద్వారాన్ని సమీపించింది. అక్కడ సిపాయి దుస్తులు ధరించి ఉన్న ఒక వ్యక్తి, "మీ వద్ద ఉంగరం ఉన్నదా?" అని అడిగాడు. ఆమె తన వద్ద ఉన్న ఉంగరం అతని చేతి కిచ్చింది. అతను దాన్ని పరీక్షగా చూసి, తన వద్ద ఉన్న మరొక ఉంగరం ఆమెకు చూపి, "పదండి," అన్నాడు.

అంతఃపురానికి ఉన్న పహరా వాళ్ళందరూ తాగి మత్తులో ఉన్నారు. ఆ వ్యక్తి తిలోత్తమను కోట వెలపలికి తీసుకువచ్చి, "చెప్పండి, మిమ్మల్ని ఎక్కడికి చేర్చాలి?" అని అడిగాడు.

విమల చెప్పిన దేమిటో తిలోత్తమ పూర్తిగా మరిచిపోయింది. చాలా సేపు ఆలోచించి, గద్గద కంఠంతో, "జగతసింహుడెక్కడ ఉంటే అక్కడికి తీసుకుపొండి," అనేసింది.

"జగతసింహుడా? జగతసింహు డిప్పుడు కారాగృహంలో ఉన్నాడు. అక్క

బంకించంద్ర చట్టోపాధ్యాయ



డికే తీసుకుపోతాను, పదండి," అన్నా డా వ్యక్తి. అతను తిలోత్తమను వెంట బెట్టుకుని తిరిగి కోటలోకి ప్రవేశించాడు. అతను కారాగృహం వద్దకు వచ్చి చూసేసరికి అక్కడి పహరా మిగిలిన చోట్ల ఉన్నట్టు లేదు. అక్కడ కాపలావాళ్ళు తమ విధిని సక్రమంగా నెరవేర్చుతున్నారు.

తిలోత్తమను వెంట బెట్టుకుని వచ్చిన వాడు ఒక కాపలావాడికి తన వద్ద ఉన్న ఉంగరం చూపి, "రాజకుమారు డెక్కడ?" అని అడిగాడు. కాపలావాడు జగతసింహుడి గది దాకా వెళ్ళి వచ్చి, "ఇక్కడే, మేలుకునే ఉన్నారు," అని చెప్పాడు.

"ఆ గది తలుపు తెరు. ఈమె అతన్ని చూడగోరుతున్నది," అన్నాడు తిలోత్తమ వెంట వచ్చినవాడు.

జగతసింహుడు సామాన్యమైన మంచం మీద పడుకుని ఉన్నాడు. తలుపు చప్పుడు విని అతను అటుకేసి చూశాడు. తిలోత్తమ ద్వారాన్ని ఊతగా పట్టుకుని నిలబడి, అడుగు లోపలికి వెయ్యలేకపోయింది. ఆమె వెంట వచ్చినవాడు, "ఏమిటిది? ఎందుకీ వృథా కాలయాపన?" అన్నాడు. అప్పటికీ ఆమె అడుగు లోపలికి పెట్టలేదు.

"లోపలికి వెళ్ళటం ఇష్టం లేకపోతే తిరిగి వెళ్ళండి. అంతేగాని అలా నిలబడ వద్దు," అన్నాడు కాపలావాడు.

తిలోత్తమ తిరిగిపోవటానికైనా కాలు కదప లేని స్థితిలో ఉన్నది. ఒక వంక కాపలావాడు, లోపలికైనా వెళ్ళమనీ, తిరిగి అయినా వెళ్ళిపొమ్మనీ పదే పదే చెబుతున్నాడు, తొందరపెడుతున్నాడు.

జగతసింహుడు మొదట్లో తిలోత్తమను గుర్తించనుకూడా లేదు; కారాగృహం లోకి ఆడది అడుగు పెట్టటం చూసి నిర్ఘాంత పోయాడు కూడా. కాని దగ్గిరగా చూస్తే తిలోత్తమ! ఒక్క క్షణం ఇద్దరి చూపులూ

కలిశాయి. మరుక్షణం తిలోత్తమకు కళ్ళు వాటంతటవే మూసుకుపోయాయి.

"వీరేంద్రసింహుడి కూతురా?" అన్నాడు జగతసింహుడు.

ఆ మాట తిలోత్తమకు హృదయంలో శూలం లాగా తగిలింది. ఇప్పుడు తాను అతనికి వీరేంద్రసింహుడి కుమార్తె మాత్రమేనా? తిలోత్తమ అన్న పేరు కూడా అతను మరిచిపోయాడా?

కొంచెం సేపుండి అతను, "ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్న కూడా ఆమెకు బాధే కలిగించింది. ఆమెకు తల తిరగ నారంభించింది. అతను సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు. కాని ఆ ప్రశ్నకు సమాధానమేముంది?

"అనవసరంగా హైరాన పడుతున్నావు. వెళ్ళిపో. గతమంతా మరిచిపో," అన్నాడు జగతసింహుడు.

తిలోత్తమకు తన దౌర్భాగ్యం పూర్తిగా అర్థమయింది. ఆమె మొదలు నరికిన చెట్టు లాగా కూలిపోయింది.

ఆమెకు స్పృహ తప్పిపోయిందని గ్రహించి జగతసింహు డామెకు తన బట్టతో విసిరాడు. అలా కూడా ఆమెకు చైతన్యం



రాకపోయే సరికి అతను కాపలావాణ్ణి పిలిచాడు. తిలోత్తమ వెంట వచ్చిన మనిషి లోపలికి వచ్చాడు.

"ఈమె ఉన్నట్టుండి మూర్ఛపోయింది. ఈమె వెంట వచ్చిన దెవరు? వాళ్ళను పిలిచి ఈమెకు శైత్యోపచారాలు చెయ్యమను," అన్నాడు జగతసింహుడు.

"నేనే ఈమెను తీసుకు వచ్చాను," అన్నాడు కాపలావాడు.

"నువా? అయితే ఇప్పుడేం చేసేటట్టు? ఎవరైనా దాసీదాన్ని పిలిపించు."

కాపలావాడు తిరిగి వచ్చేలోగా జగతసింహుడు తిలోత్తమకు తనకు చాతనైన



విసిరిన మీదట తిలోత్తమకు క్రమంగా మూర్ఛ తెలియసాగింది. ఆమె కళ్ళు తెరిచి, తా నెక్కడ ఉన్నదీ గ్రహించగానే, బయటికి వెళ్ళిపోవటానికి లేవబోయింది. కాని ఆమె శరీరంలో లేచి నిలబడే శక్తి కూడా లేదు.

అయుషా ఆమె చెయ్యి పట్టుకుని, "చెల్లీ, ఎందుకు కంగారుపడతావు? నీలో శక్తి ఏ మాత్రమూ లేదు. నా గదికి వచ్చి విశ్రాంతి తీసుకో. ఆరోగ్యం పొందాక నిన్ను ఎక్కడికి చేర్చమంటే అక్కడికి చేర్చుతాను," అన్నది.

తిలోత్తమ ఏమీ జవాబు చెప్పక మౌనంగా ఉండిపోయింది.

"ఏమమ్మా, నా మీద నమ్మకం లేదా? నేను మీ శత్రువుకు కూతుర్నే అనుకో, కాని అంత మాత్రాన నన్ను అనుమానించనవసరం లేదు. నా వల్ల నీ కెలాటి కీడూ రాదు. తెల్లవారే లోపలనే నిన్ను కోరిన చోటికి పంపేస్తాను," అన్నది అయుషా.

అయుషా ఆ మాట లన్న పద్ధతి వింటే తిలోత్తమకు ఆమెను శంకించటం సాధ్యం కాలేదు. తిలోత్తమకు ఇప్పుడు వెళ్ళిపోయే శక్తీ లేదు. జగతసింహుడి సమీపంలో ఉండటం కూడా బాధాకరంగానే ఉన్నది.

విధంగా ఉపచర్యలు చేశాడు. ఆమెకు కొంచెం కొంచెంగా స్పృహ వస్తున్నట్టు కనబడింది. ఇంతలో నవాబు కుమార్తె అయిన అయుషా, మరొక స్త్రీ అక్కడికి వచ్చారు.

అయుషా జగతసింహుడితో, "ఏమిటిది? ఈమె ఎవరు?" అంటూ మూర్ఛపడి ఉన్న తిలోత్తమను చూపింది.

"ఈమె వీరేంద్రసింహుడి కుమార్తె," అన్నాడు జగతసింహుడు.

ఎలాటి సంకోచం గాని, తడబాటు గాని, మానసికమైన గుంజాటన గాని లేకుండా అయుషా తిలోత్తమను తన ఒడిలోకి తీసుకుని కూర్చున్నది. పన్నీరు జల్లి, దాసీది

అందుచేత ఆమె ఆయుషా మందిరానికి వెళ్ళటానికి ఒప్పుకున్నది.

"నువు నడవ లేవు. నా దాసి నిన్ను పట్టుకుని నా గదికి తీసుకుపోతుంది. అక్కడ విశ్రాంతి తీసుకో, నే నిప్పుడే వచ్చేస్తున్నాను," అన్నది ఆయుషా తిలోత్తమతో.

తిలోత్తమ దాసీ భుజం మీద చెయ్యి వేసి నింపాదిగా నడుస్తూ బయలుదేరింది. ఆయుషా జగతసింహుడికి వీడ్కోలు చెప్పి తాను కూడా బయలుదేరదామనుకున్నది, కాని జగతసింహుడి ముఖం చూస్తే అతను ఏదో చెప్పదలుచుకున్నట్టు కన బడ్డాడు. అందుచేత ఆమె దాసీతో, "నువ్వామెను నా గదికి చేర్చి మళ్ళీ రా," అన్నది.

తిలోత్తమ కనబడకుండా పోయిన దాకా జగతసింహు డామెనే చూస్తూ, "తిలోత్తమా, ఇదే మన తుది సందర్శనం!" అనుకున్నాడు.

ఉంగరం చూపిన మనిషి తిలోత్తమ వెళ్ళిపోయేటప్పుడు ఆమెను సమీపించి, "ఇక నేను వెళ్ళవచ్చునా ?" అని అడిగాడు. తిలోత్తమ జవా బివ్వలేదు గాని, ఆమె వెంట ఉన్న దాసి, "ఆఁ" అన్నది. వాడు ఆమె వద్ద ఉండే ఉంగరం తీసుకుని వెళ్ళిపోయాడు.



తన దాసి వెంట తిలోత్తమ వెళ్ళిపోగానే ఆయుషా జగతసింహుడి మంచం పైన కూర్చుని, "యువరాజా, మీరు నా కేదో చెప్పా లనుకుంటున్నట్టున్నది. అందుకే నేను ఉండిపోయాను. నా నుండి ఏమైనా కావాలంటే నిస్సంకోచంగా చెప్పవచ్చు. మీ కేదైనా సహాయం చెయ్యగలిగితే నేను సంతోషిస్తాను," అన్నది.

"నవాబ్ జాదీ, ఇక నాకు ఏ సహాయమూ అవసరం లేదు. నే నిప్పు డున్నది అంతిమ దశ లాగా కనబడుతుంది. అందుచేత మనం కలుసు కోవటం ఇదే ఆఖరుసారి కావచ్చు. నేను మీ కెంతగా ఋణపడి




ఉన్నానంటే దాన్ని మాటలలో వివరించటం సాధ్యం కాదు. ఒక వేళ నేను స్వతంత్రుణ్ణయి నాకు మంచి రోజులు వచ్చే మాట ఉంటే నా చేత మీకు కావలిసిన ఎలాటి సేవ అయినా సరే చేయించుకోమని నా ప్రార్థన," అన్నాడు జగతసింహుడు.

అతని కంఠంలో ఉన్న దైన్యం చూసి ఆయుషా కంట కన్నీరు తిరిగింది. ఆమె అతనితో, "మీరు అంత నిస్సహాయ స్థితిలో ఉన్నట్టు దేనికి అనుకోవాలి? నిరాశ చెందటం భావ్యం కాదు. ఇవాళ ఉన్న కష్టం రేపు ఉండకపోవచ్చు. సుఖదుఃఖాలు శాశ్వతం కాదు," అన్నది.

"నన్ను బాధిస్తున్నది నిరాశ కాదు. నాకు ఆశ పైన వాంఛ పోయింది. ఈ కారాగారం నుంచి విముక్తుణ్ణి కావాలన్న కోరిక నాకు లేదు. ఈ జన్మ కిక నాకు సుఖమనేది లేదు. నా మనస్సులో ఉన్న దుఃఖాన్ని మీరు గ్రహించలేరు, నేను వివరించనూ లేను," అన్నాడు జగతసింహుడు.

అతని మాటలకు ఆయుషా అత్యాశ్చర్యం చెంది, "మీకు అంత దుర్భరమైన దుఃఖం ఏ కారణం చేత కలిగింది? వీరేంద్ర సింహుడి కూతురేమైనా—" అని ఏమో చెప్పబోయింది.

జగతసింహు డామె మాటకు అడ్డొచ్చి, "ఆమె ఊసెత్తటం వృథా. ఆ కల ఏనాడో కరిగిపోయింది," అన్నాడు.

ఆయుషా కొంచెంసేపు తల వంచుకుని ఉండి, "యువరాజా, మీ రీ విధంగా ఈ కారాగృహంలో కుములుతూ ఉండటం నాకు దుస్సహంగా ఉంది. నా వెంట బయలుదేరండి. నేను మిమ్మల్ని విడిపిస్తాను. ఈ రాత్రే మీ శిబిరానికి క్షేమంగా వెళ్ళిపొండి," అన్నది.

"ఆయుషా, మీ తండ్రికి తెలియకుండానే నన్ను విముక్తుణ్ణి చేస్తావా?" అన్నాడు జగతసింహుడు.



"ఆ విషయమై విచారించకు. నువు మీ శిబిరం చేరాక నే నాయనతో చెప్పే స్తానులే," అన్నది ఆయుషా,

ఇద్దరూ అప్రయత్నంగా ఒకరి నొకరు "నువు" అని సంబోధించుకున్నారు.

"ఆయనకు తెలిసినాక నీకు చాలా చిక్కు వస్తుంది."

"ఏమీ భయంలేదు. ఏం జరుగుతుందో నేనూ చూస్తాను."

"ఆయుషా, నేను రాను."

"ఏం?" అన్నది ఆయుషా తెల్లబోతూ.

"నా ప్రాణదాతవు. నీకు బాధ కలిగించే పని చెయ్యలేను. నువు వెళ్ళిపో."

ఆయుషా మాట్లాడ లేదు. దుఃఖం వల్ల ఆమె కళ్ళ నుంచి టపటపా కన్నీటి బిందువులు రాలాయి.

ఎప్పుడో వారిద్దరికీ తెలియకుండా మూడో మనిషి వచ్చి గది వాకిలి దగ్గర నిలబడి ఉన్నాడు. అతను వారిద్దరినీ సమీపించి, "భేష్, నవాబ్‌జాదీ! బలే బాగుంది!" అన్నాడు.

ఇద్దరూ అతని కేసి చూసి, ఆ వచ్చిన వాడు ఉస్మాన్‌ఖాన్ అని గ్రహించారు. ఉస్మాన్ వెటకారంగా అన్న మాట చెవిని పడే సరికి, ఆయుషా కిక కష్టాలు తప్పవని జగతసింహుడు భావించాడు. ఆయుషా కూడా ఉస్మాన్ భావాన్ని సరిగానే గ్రహించింది. కాని ఆ సంగతి ఏమాత్రమూ బయట పడనీయక, "భలే బాగున్నదేమిటి, ఉస్మాన్?" అని అడిగింది.

"అర్ధరాత్రి వేళ నవాబు కూతురు ఒంటరిగా కారాగృహం లోకి వచ్చి ఖైదీతో ప్రేమసల్లాపాలు జరపడం బాగుండ కేం చేస్తుంది?" అన్నాడు ఉస్మాన్.

ఆయుషా ఉస్మాన్ కేసి తీవ్రంగా చూస్తూ, "కారాగృహం లోకి వచ్చి ఖైదీతో ప్రేమసల్లాపాలు జరపటమూ, జరపక పోవటమూ కేవలం నా ఇచ్ఛపై ఆధారపడిన

విషయం. అది బాగున్నదీ, లేనిదీ తెలుసుకో వలసిన అవసరం నీ కేమాత్రమూ లేదు," అన్నది.

ఈ మాటలు విని ఉస్మాన్ నిర్ఘాంత పోయాడు. అతనిలో ఆశ్చర్యం కంటె క్రోధమే హెచ్చుగా కలిగింది; "అవసరం నా కున్నదో లేదో రేపు నవాబుగారి నోటనే వింటువుగాని!" అన్నాడు.

"నాన్నగా రడిగినప్పుడు నేను సమాధానం చెబుతానులే. దాన్ని గురించి నువు బెంగపడ నవసరం లేదు," అన్నది ఆయుషా దృఢంగానూ, రోషంగానూ.

"ఆ మాట నేనే అడిగితే?" అన్నాడు ఉస్మాన్ గుచ్చినట్టుగా.

ఆయుషా మరింత నిటారుగా నిలబడి, అతని ముఖం కేసి కొంతసేపు తేరిపార జూసి, స్ఫుటమైన స్వరంతో, "నువ్వడిగే పక్షంలో, ఈ ఖైదీ నా ప్రాణేశ్వరు డని నా సమాధానం, ఉస్మాన్," అన్నది.

ఈ మాట విని ఉస్మానూ, జగత సింహుడూ కూడా తమ మీద పిడుగు పడ్డట్టయిపోయారు. యువరాజు కళ్ళు తెరుపుడు పడ్డాయి. ఆయుషా దుఃఖానికి కారణం అతను గ్రహించాడు.

ఆయుషా అతని కేసి తిరిగి, "యువరాజా, నన్ను క్షమించు. ఉస్మాన్ నన్ను ఇలా గుచ్చి అడగక పోయినట్టయితే నా హృదయ సంతాపాన్ని నీ ముందు బయట పెట్టి ఉండకపోదును; నీ కెన్నటికీ అది తెలియకుండానే ఉండిపోను!" అన్నది. జగత సింహుడు మౌనంగా నిలబడ్డాడు.

అక్కడ ఒక్క క్షణమైనా నిలబడకుండా, దాసీ రాకకు ఎదురు చూడకుండా ఆయుషా అక్కడి నుంచి ఒంటరిగానే బయలుదేరి వెళ్ళిపోయింది. ఉస్మాన్ కొంచెం సేపు స్తంభించి నిలబడిపోయి, తరవాత నింపాదిగా తన గృహానికి బయలుదేరిపోయాడు. —(ఇంకా వుంది)






# గర్విష్ఠి భార్య

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఎంతో గర్వాతిశయం ఉండదగిన నీవు దీక్షతో ఈ హేయమైన పని చేస్తుంటే నాకు కన్యాకుబ్జ దేశానికి చెందిన కౌండిన్యుడు జ్ఞాపకానికి వస్తున్నాడు. అతి విచిత్రమైన అతని కథను చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

కన్యాకుబ్జ నగరంలో కౌండిన్యు డనే యువకు డుండేవాడు. అతను ధనికుడు. అతను సుమంతు డనే ముని యొక్క కుమార్తెను పెళ్ళాడాడు. సుమంతుడు కూడా సంపన్నుడే. ఆ విధంగా కౌండిన్యుడి భార్య సంపన్నుల ఇంటి ఆడబడుచూ, సంపన్నుల ఇంటి కోడలూ కూడా అయి, మహా గర్విష్ఠిగా ఉండేది.

## బేతాళ కథలు



కొంత కాలం గడిచాక కౌండిన్యుడి తండ్రి చనిపోయాడు. అతని తల్లి భర్తతో బాటు సహగమనం చేసింది. కౌండిన్యుడు తన తల్లిదండ్రులకు పరలోక క్రియలు జరిపి, రెండు నెలలు గడిచాక రాజధాని కేదో పని మీద వెళ్ళాడు. అక్కడ అతనికి అందగత్తె లైన వేశ్యలు కనిపించారు. అతను వారిలో ఇద్దరిని చూసి సమ్మోహితుడై, తన కున్నదంతా అయిపోయిన దాకా వారితో విలాసంగా కాలం గడిపి, ఇంటికి తిరిగి వచ్చాడు.

అసలే గర్విష్ఠి అయిన అతని భార్య తన భర్త చేసిన పనికి అతన్ని చూసి చాలా చీదరించుకున్నది. కౌండిన్యుడు వర్తకం చేసుకుని డబ్బు గడించుకుందామనే ఉద్దేశంతో తన భార్యను నగల నియ్యమని బతిమాలాడు. ఆమె నగల నియ్యకపోగా, భర్తను పురుగు కింద కట్టేసి, తన పుట్టింటికి వెళ్ళిపోయింది.

కౌండిన్యుడు హతాశుడై, ఇల్లూ వాకిలీ వదిలిపెట్టేసి వర్తక నౌక ఒకటి సముద్రం మీద బయలుదేరు తుంటే తను కూడా ఆ నౌకలో ఎక్కాడు. సముద్ర మధ్యంలో ఆ నౌక కాస్తా మునిగిపోయింది. కౌండిన్యుడొక్కడు తప్ప నౌకలో ప్రయాణిస్తున్న వారందరూ సముద్రంలో మునిగిపోయారు.

కౌండిన్యుడికి అదృష్టవశాన ఒక కొయ్య తెప్పగా దొరికింది. అతను దాని ఆధారంతో తన ప్రాణాలు కాపాడుకొని, ఎలాగో ఒక పర్వతం దగ్గిరికి కొట్టుకువచ్చాడు. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. ఆ పర్వతం మీద ద్రాక్ష పొద లున్నాయి. అత నా ద్రాక్ష పళ్ళు తిని ఆకలి తీర్చుకుని, ఒక ఎత్తయిన మద్దిచెట్టు కింద తన పై బట్ట పరుచుకుని పడుకున్నాడు. కొంచెం సేపటికి చీకటి పడింది.

ఆ రాత్రి ఆ పర్వతం మీద ఒక వింత జరిగింది.

కాశీ రాజుకు రత్నావళి అనే కుమార్తె ఉన్నది. ఆమె అతిలోక సుందరి. ఆ రాత్రి ఆమె కాళ్ళు కడుక్కోకుండా, ఉత్తరంగా తల పెట్టుకుని పడుకుని నిద్రపోయింది. ఆ అవకాశం చూసుకుని ఒక రాక్షసుడు ఆ రాజకుమార్తె నెత్తుకుని, కౌండిన్యుడు చేరిన పర్వతం మీదికి వచ్చి, ఆమె నొక అందమైన గుహలోకి తీసుకుపోయాడు. ఆ గుహలో అన్ని రకాల సామగ్రి చక్కగా అమర్చి ఉన్నది.

రాక్షసుడు రత్నావళిని గుహలో దించిన మరుక్షణంలోనే ఆ రాక్షసుడి భార్య ఎక్కడి నుంచో అతి వేగంగా వచ్చి, ఏడుస్తున్న రాజకుమార్తెను చూసి, "ఇది ఎవతె? దీన్ని ఎందుకు తెచ్చావు?" అని గదమాయించి అడిగింది.

"నీకు ఆహారంగా తీసుకువచ్చాను. ఈ కొండ మీదనే మద్దిచెట్టు కింద ఒక బ్రాహ్మణ యువకుడు పడుకుని ఉన్నాడు. వాణ్ణి నేను తింటాను. వెళ్ళి పట్టుకురా," అన్నాడు రాక్షసుడు తన భార్యతో.

వెంటనే రత్నావళి రాక్షసితో, "ఒసే, నీ మొగుడు వచ్చి అబద్ధాలు చెబుతున్నాడు. నువు ముసలిదానివయావని, పడుచుగా ఉన్న నన్ను తెచ్చుకున్నాడు," అన్నది.



రాక్షసుడి భార్య అసూయతో మండిపడి, "సరే, నీ కోసం ఆ చెట్టు కింద ఉన్న బ్రాహ్మణ యువకుణ్ణి తెస్తానుండు!" అని చెప్పి, కౌండిన్యుడున్న చోటికి వచ్చి, అతనితో మంచిగా మాట్లాడి, "నా భర్త నన్ను వదిలి పెట్టేశాడు. వాడి దగ్గిర శక్తి అనే ఆయుధం ఉన్నది. దాన్ని తెచ్చి నీ కిస్తాను. దానితో నా మొగుణ్ణి చంపేసి నట్టయితే నేను నీకు బానిసగా ఉండి, ఎంత సేవైనా చేస్తాను," అన్నది.

"నీవు రాక్షసివి. నా వంటి వాళ్ళను తినే దానివి. నీ మాట ఎలా నమ్మటం?" అన్నాడు కౌండిన్యుడు.



"ఏ పాపమో చేసుకోబట్టే గదా నేనూ, నా మొగుడూ ఈ రాక్షస జన్మ ఎత్తాం? ఈ రాక్షస జన్మ వదిలితే వాడు బాగుపడ తాడు. నీ ప్రాణం కాపాడిన పుణ్యం చేత నాకు కూడా మంచి జన్మ కలుగుతుంది," అన్నది రాక్షసి.

"సరే, అయితే ఆ శక్తిని తీసుకురా," అన్నాడు కౌండిన్యుడు. రాక్షసి వెళ్ళి ఆ శక్తిని తెచ్చి అతని కిచ్చింది.

ఈ లోపల గుహలో రాక్షసుడు రాజ కుమార్తెను బలాత్కరించబోయాడు. ఆమె వాడి బారి నుంచి తప్పించుకునే ఉపాయం లేక ఆ రాక్షసుడితో, "నాతో సుఖపడాలంటే కనీసం నన్ను శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకో. ఆ చెట్టు కింద ఉన్నాడంటివే, ఆ బ్రాహ్మణ యువకుణ్ణి, నీ భార్య ఈపాటికే తిన కుండా ఉంటే వెంటపెట్టుకురా. అతను మంత్ర యుక్తంగా మనకు పెళ్ళి చేశాక, కావలిస్తే అతన్ని నువే తిందువుగాని!" అన్నది.

మూఢుడైన ఆ రాక్షసుడికి ఇది చాలా మంచి సలహాగా తోచింది. అందుచేత వాడు గుహ నుంచి బయలుదేరి మద్దిచెట్టు కింద ఉన్న కౌండిన్యుడి వద్దకు వెళ్ళాడు.

వాడింకా దూరాన ఉండగానే రాక్షసి కౌండిన్యుడితో, "ఆ వచ్చేవాడే నా మొగుడు. నిన్ను తినటానికి వస్తున్నాడు. శక్తితో ఒక్కటి పెట్టావంటే ఛస్తాడు," అని చెప్పింది.

రాక్షసుణ్ణి దగ్గిర దాకా రానిచ్చి కౌండిన్యుడు శక్తి ప్రయోగించి చంపేశాడు. ఆ రాక్షసుడు చచ్చిన చోటు శక్తి క్షేత్ర మని ప్రసిద్ధికెక్కింది.

ఆ రాక్షసి కౌండిన్యుడితో, "నేను కిందటి జన్మలో ఔర్వు డనే ముని కుమార్తెను. నా పేరు కందళి. నన్ను నా తండ్రి దూర్వాసుడి కిచ్చి పెళ్ళిచేశాడు. నేను నా భర్తతో అస్తమానమూ పోట్లాడే దాన్ని. చూసి చూసి నా భర్త నన్ను భస్మం

కమ్మని శపించాడు. పాప ఫలం పూర్తిగా నాశనం కాక ఈ రాక్షసి జన్మ ఎత్తాను. అయినా శాపం అనుభవించిన కారణంచేత నాది పూర్తిగా రాక్షస బుద్ధి కాదు. అందుకే నే నిప్పుడు నీకు సహాయపడి పుణ్యం సంపాదించుకున్నాను. నా భర్త కాశీ రాజైన సుద్యుమ్నుడి కుమార్తెను, రత్నావళి అనే దాన్ని ఎత్తుకొచ్చాడు. ఆమె ఇప్పుడీ కొండ మీదనే ఉన్నది. నీ వామెను పెళ్ళాడు. మిమ్మ ల్నిద్దరినీ నేను క్షణంలో కాశీ చేర్చు తాను. నేను మీ ఇద్దరినీ కనిపెట్టి ఉంటాను," అన్నది.

కౌండిన్యు డిందుకు సమ్మతించాడు. రాక్షసి ఏనుగు రూపం ధరించి, రత్నావళినీ, కౌండిన్యుణ్ణీ తన పైన ఎక్కించుకుని రెప్ప పాటు కాలంలో కాశీ లోని విశ్వేశ్వ రాలయం దగ్గిర వాలింది. ఆమె సలహా పైన కౌండిన్యుడు రత్నావళిని రాజుగారి వద్దకు తీసుకుపోయాడు. రత్నావళి తన తండ్రితో జరిగిన దంతా చెప్పి, "ఈ యువకుడు నన్ను కాపాడాడు. అతనితో బాటు నేను ఏనుగుపైన ఎక్కాను. ఈ రెండు కారణాల చేతా ఇతను నా భర్త కావటానికి అర్హుడు!" అన్నది. కాశీ రాజు సంతోషంగా కౌండిన్యుడికి తన కుమార్తె నిచ్చి వైభవంగా పెళ్ళి చేసి,




అంతులేని రత్నాలతో సహా మహోదయ పురాన్ని అతని కిచ్చేశాడు.

ఇంత జరిగాక కౌండిన్యుడి మొదటి భార్యను ఆమె బంధువులు నానా మాటలూ అన్నారు. "ఇప్పుడు చూడు, నీ భర్త కెలాటి యోగం పట్టిందో! అతన్ని నానా మాటలూ అన్నావు! ఇప్పు డతని దగ్గిరికి ఏ మొహం పెట్టుకు పోతావు? పోతే మాత్రం నిన్న తను ఆదరించి ఏలుకుంటాడా ఏమిటి? నిన్ను కుక్కకన్న హీనంగా చూస్తాడు," అన్నారు వాళ్ళు.

ఆమె కూడా తాను భర్త విషయంలో పొగరుబోతుగా ప్రవర్తించి నందుకు చాలా

పశ్చాత్తాప పడింది. "ఆయన నా నగ లడిగి నప్పుడెందు కివ్వాను కాను ?" అని తనను తాను తిట్టుకున్నది.

ఈ సమయంలో అందరూ ఆశ్చర్య పడేలాగా కౌండిన్యుడు తన మొదటి భార్య కోసం పల్లకీ పంపాడు. ఆమె అందులో ఎక్కటానికి కూడా సిగ్గుపడి, పల్లకీ తెచ్చిన వాళ్ళ ప్రోద్బలంతో ఆ పల్లకీలోకి ఎక్కి తన భర్త వద్దకు వెళ్ళింది. కౌండిన్యుడు తన పెద్ద భార్యను ఎంతో ఆదరంతో స్వీకరించాడు.

బేతాళుడీ కథ చెప్పి," రాజా, నా కొక సందేహం. తనను పురుగు కన్న హీనంగా చూసి, దరిద్ర స్థితిలో తన నగలు కూడా ఇవ్వ నిరాకరించిన భార్యను కౌండిన్యుడు, తనకు మంచి రోజులు వచ్చాక ఎందుకు చేరదీసి ఆదరించాడు? ఆమె పై నిజంగా ప్రేమ ఉండటం చేతనా? లేక ఆమె అనాదరణ ఫలితంగానే తాను సముద్ర యానం చెయ్యటమూ, సముద్రంలో నౌక మునగటమూ, చివరకు తానొక రాజ కుమార్తెకు భర్త కావటమూ మొదలైన శుభాలన్నీ జరిగాయన్న కృతజ్ఞత వల్లనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కౌండిన్యుడికి తన భార్య మీద గొప్ప ప్రేమా లేదు, కోపమూ లేదు, కృతజ్ఞతా లేదు. తన ఐశ్వర్యానికి అహంకరించే మనిషి, తన కన్న ఐశ్వర్యవంతుడైన భర్త ముందు అణకువగా ఉంటుంది. గర్విష్ఠి అయిన తన భార్యను అణకువగా చేసుకునే సంతృప్తి కోసం కౌండిన్యుడు తన మొదటి భార్యను పిలిపించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# సురతమంజరి కథ

ఉజ్జయినీ నగరరాజైన చండమహాసేనుడి అనంతరం ఆయన కొడుకు గోపాలకుడు రాజయాడు. అతని భార్య పేరు అవంతి మతి. వారికి అవంతివర్ధను డని ఒక కొడుకుండేవాడు.

ఒక రోజు ఉజ్జయినీ నగర పౌరులు జలదానోత్సవంలో మునిగి తేలుతూన్న సమయంలో ఒక మదపుటేనుగు కట్టు తెంచుకుని నగరం మీదపడి నానా భీభత్సమూ చెయ్యసాగింది. మావటివాళ్ళ కది లొంగక, దారిలో అడ్డం వచ్చిన వారిని అనేకమందిని చంపుతూ మాలగూడెం కేసి పరిగెత్తింది.

ఆ సమయంలో ఆ గూడెంలో నుంచి ఒక అద్భుత సౌందర్యవతి అయిన ఒక కన్య దాని కెదురుగా వచ్చింది. ఆమెను చూడగానే ఆ ఏనుగు మంత్రం వేసినట్టుగా ఆగి, అలాగే నిలబడిపోయింది. ఆ మాల పిల్ల ఆ ఏనుగు తొండాన్ని నిమిరి, తన పై వస్త్రం తీసి దాని దంతాలకు ఉయ్యాల లాగా వేసి, ఎగిరి అందులో కూర్చుని ఊగ నారంభించింది. ఆమె ఊగుతున్న చోట ఎండగా ఉండటం చేత ఏనుగు ఆమెను ఒక చెట్టు నీడకు తీసుకుపోయింది.

ఇదంతా చూసిన పురజనులు విడ్డూరంగా చెప్పుకున్నారు. ఎవరి నోట విన్నా ఇవే మాటలు. ఈ మాలపిల్ల నోరు లేని జంతువును సైతం ఎంత అద్భుతంగా వశ పరచుకున్నది! ఆమెకు ఆ అందానికి తోడు అంత ప్రభావం కూడా ఎలా కలిగిందో!

జనం చెప్పుకుంటున్న ఈ వింత రాజకుమారుడైన అవంతివర్ధనుడి చెవిన పడింది. అతను ఆ పిల్లనూ, ఆమె అదుపు చేసిన ఏనుగునూ స్వయంగా చూద్దామని బయలుదేరి వచ్చి, తానే ఆమె మోహ పాశంలో చిక్కుకుపోయాడు. అతన్ని చూసి

ఆ పిల్ల కూడా గాఢంగా ప్రేమించింది. ఆమె చప్పున తన ఉయ్యాలలో నుంచి దిగి, ఏనుగుదంతాల నుంచి తన పై బట్ట విప్పి, మీద వేసుకుని తన ఇంటికి వెళ్ళి పోయింది. మావటివాడు ఏనుగు నెక్కి తోలుకుపోయాడు.

అవంతివర్ధనుడు తన బుద్ధినీ, హృదయాన్నీ మాలపిల్లకు అర్పించుకుని, కట్టెలాగా మిగిలిపోయిన శరీరాన్ని ఇంటికి చేర్చాడు. అతనికి జలదానోత్సవం మాట కూడా జ్ఞాపకంలేదు. అతను తన స్నేహితులను, "ఆ పిల్ల ఎవరు? పేరేమిటి?" అని అడిగాడు.

"మాల గూడెంలో వీరబాహుడనే మాలవాడొకడున్నాడు. ఈ పిల్ల వాడి కూతురు. పేరు సురతమంజరి. ఆమెను బొమ్మను చూసినట్టుగా చూసి ఆనందించవలిసిందేగాని, పెళ్ళాడి భార్యగా చేసుకోవటానికి తగినది కాదు," అని అవంతివర్ధనుడితో మిత్రులన్నారు.

"అబద్ధం! ఆమె మాలపిల్ల ఎంత మాత్రమూ కాదు, ఎవరో దేవతా స్త్రీ. మాలపిల్ల కలాటి రూపసౌందర్యం ఎలా వస్తుంది? ఆమె నాకు భార్య కాని పక్షంలో నేను నిశ్చయంగా బతకను," అన్నాడు అవంతివర్ధనుడు.



అతని మనసు మార్చటానికి మంత్రులు విశ్వప్రయత్నం చేశారు. కాని వారి ప్రయత్నం ఏ మాత్రమూ ఫలించ లేదు. అతని స్థితి చూసి తల్లిదండ్రులు చాలా ఆందోళనపడ్డారు.

"నా కడుపున పుట్టినవాడు హీనజాతి కన్యను ప్రేమించటం ఆశ్చర్యంగా ఉన్నదే!" అన్నది అవంతిమతీదేవి. అలా జరగటానికి ఒక కారణం ఆ పిల్ల నిజంగా మాలది కాక, కారణాంతరాల వల్ల మాలదిగా ఉంటూ ఉండటం కావచ్చుననీ, లేదా పూర్వజన్మ సంబంధం కూడా ఒక కారణం కావచ్చుననీ మంత్రులు చెప్పారు; ఏమైనప్పటికీ రాజకుమారుడి సుఖం కోరి అతనికి సురతమంజరి నిచ్చి పెళ్ళి చెయ్యటమే యుక్తమని తేల్చారు.

ఆ సలహా ప్రకారం గోపాలకమహారాజు గూడెంలో ఉన్న వీరబాహుడి వద్దకు దూతలను పంపి, "నీ కుమార్తెను రాజకుమారుడి కిచ్చి పెళ్ళిచెయ్యి," అని అడిగించాడు.

వీరబాహుడు రాజుగారు పంపిన వర్తమానం విని దూతలతో, "నా కూతుర్ని రాజకుమారుడి కిచ్చి పెళ్ళి చెయ్యటం నా కిష్టమేగాని రాజుగారు ఒక్క నియమానికి ఒప్పుకోవాలి. అదేమిటంటే,



రాజుగారు నా యింట పద్దెనిమిదివేల బ్రాహ్మణులకు, ఈ ఊళ్ళోవాళ్ళకు, సంత ర్పణ జరిపించాలి. అలా చేసినట్టయితే నా కూతురు సురతమంజరి రాజుగారికి కోడలవుతుంది," అన్నాడు.

దూతలు తిరిగివచ్చి గోపాలకమహా రాజుతో వీరబాహుడు పెట్టిన నిబంధన విన్నవించారు.

అలాటి నిబంధనకు అర్థమేమిటో గోపా లకుడికి అంతు చిక్కలేదు. అందుకేదో తగిన కారణం ఉండి ఉంటుందనుకుని, అతను బ్రాహ్మణులను పిలిపించి, "మీరు పద్దెనిమిదివేల మంది వీరబాహుడనే మాలవాడు తన ఇంట చేసే సంతర్పణలో భోజనం చెయ్యాలి. ఇది నా ఆజ్ఞ. మీరు దాన్ని పాటించకపోతే మీకు ప్రమాదం తప్పదు," అని హెచ్చరించాడు.

బ్రాహ్మణుల పని ముందు నుయ్యా, వెనక గొయ్యా అయింది. రాజాజ్ఞ మీరితే రాజదండన, రాజాజ్ఞ పాలిస్తే మాల సంత ర్పణ! చివరకు రాజదండన భయమే నెగ్గింది.

వారు గోపాలక మహారాజుతో, "మహా రాజా, వీరబాహుడు శుచిగా సంతర్పణ చేసే పక్షంలో మేము భోజనం చేస్తాం. కాని మాలగూడెంలో మటుకు వద్దు!" అని చెప్పారు.

రాజు వీరబాహుడి కోసం వేరే ఒక పెద్ద ఇల్లు కట్టించి, అందులో పద్దెనిమిది వేల మందికి సంతర్పణ భోజనం ఏర్పాటు చేయించాడు.

బ్రాహ్మణులు భోజనాలు చేసేటప్పుడు వీరబాహుడు స్నానం చేసి వచ్చి, వారి కెదురుగా కూర్చున్నాడు.

తరవాత గోపాలక మహారాజు వీర బాహుడి కూతురు సురతమంజరిని తన ఇంటికి తీసుకువచ్చి, తన కొడుకైన అవంతి వర్ధనుడికి వైభవంగా పెళ్ళిచేశాడు.





# రథోత్సవం

పాపన్న ఉండే గ్రామంలో ఏటా శివరాత్రికి రథోత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవంలో ఊళ్ళో ప్రతి ఒక్కరూ పాల్గొనటమే కాకుండా పొరుగు గ్రామాల నుంచి కూడా విశేషంగా జనం వస్తారు. రథోత్సవం చాలా వైభవంగా జరుగుతుంది.

ఈ ఉత్సవ కార్యాలలో మామూలుగా పాపన్న కూడా పాల్గొంటూ ఉండే వాడు. కాని ఈ యేడు దేవాలయ నిర్వాహకులు అతన్ని దూరంగా ఉంచారు. వారికి పాపన్న చర్యలు కొన్ని నచ్చలేదు.

ఆ ఊళ్ళో బండయ్య అనే భ్రష్టు డొక డున్నాడు. వాడు సంఘ నియమాలను ఖాతరు చెయ్యక, చెయ్యరాని పనులన్నీ చేసి, తన బంధువులకు కూడా వెలి అయ్యాడు. వాడంటే ఊళ్ళో చాలా మందికి భయం, అందరికీ అసహ్యం. వాణ్ణి అందరూ పాపిష్ఠి బండయ్య అనే వారు. లోకానికి వెలి అయినాక వాడు కేవలమూ పాప కార్యాలు చేసే బతక వలిసి వచ్చింది. దేవుడు కూడా వాణ్ణి బహిష్కరించినట్టే ప్రజలు భావించారు; ఎందుకంటే, వాడికి కలిగిన సంతానంలో ఏ ఒక్క బిడ్డా ఏడాది నిండే దాకా బతకలేదు.

బండయ్య కిప్పుడు అరవై ఏళ్ళు. శక్తు లన్నీ ఉడిగిపోయాక వాడు తన గత జీవితాన్ని పారజూసుకుని, తన కిక భగవంతుడు తప్ప మరే దిక్కూ లేదని నిశ్చయించుకున్నాడు. వాడు ఆలయానికి వెళ్ళి దేవుడికి దణ్ణం పెట్టుకుని ధ్యానం చేస్తూండగా, ఊళ్ళోవాళ్ళు చూసి, "దొంగముండా కొడుకు! దేవుడి సొమ్ము మీద మళ్ళీ వీడి కన్ను పడింది!" అంటూ వాణ్ణి గుడిలో నుంచి బయటికి తరిమి, గట్టిగా తన్నారు.

బండయ్య భక్తిని ఊళ్ళోవాళ్ళు ఎలా నమ్ముతారు? వాడు అదివర కొకసారి




భక్తుడి లాగా నటించి దేవుడి సొత్తు కాజేసి దొరికిపోయాడు.

తన్నులు తిని వీధిలో పడిపోయి, "ఓయి, దేవుడా! నువే దిక్కు!" అని మూలుగుతున్న బండయ్యు పాపన్న కంట పడ్డాడు. పాపన్న బండయ్యను లేవదీసి, అతని ఇంటికి చేర్చి, కొంత డబ్బిచ్చి, "నీ కెప్పుడన్నా సహాయం కావలిస్తే నన్న డుగు, బండయ్యా!" అన్నాడు. అయితే బండయ్య ఎన్నడూ పాపన్నను సహాయం అడిగాడు కాడు.

ఊరు ఊరంతా మహాపాపిగా ఎంచే బండయ్యను పాపన్న ఆదుకోవటం ఊళ్ళో పెద్దలకు నచ్చలేదు. తన్నులు తిన్నవాణ్ణి ఆదరించి తీసుకుపోవటం ఒక విధంగా తన్నిన వాళ్ళను పాపన్న విమర్శించినట్టే గద! ఈ పని చేసిన పాపన్నను రథోత్సవ కార్యక్రమాలలో చొరనివ్వరాదనీ, చివరకు అతను రథం తాడు పట్టినా దేవుడు మైల పడిపోతాడనీ దేవాలయ నిర్వాహకులు నిశ్చయించుకున్నారు.

ఇది చూసి పాపన్న చాలా నొచ్చుకున్నాడు. అతను తాను చేసిన తప్పేమిటని ఆలయ నిర్వాహకుల నడిగి తెలుసుకుని, "నే చేసినది తప్పయితే ప్రాయశ్చిత్తం చెప్పండి. అంతేగాని నన్ను దేవకార్యం నుంచి వెలి వెయ్యవద్దు," అన్నాడు.

అపరాధం కింద కొంత సొమ్ము చెల్లిస్తే చేసిన పాపానికి ప్రాయశ్చిత్త మవుతుందని పెద్దలు నిర్ణయించారు. పాపన్న ప్రాయశ్చిత్తం చేసుకుని రథం తాడుపట్టే అర్హత సంపాదించుకున్నాడు.

శివరాత్రి నాడు ఆలయం నుంచి రథం బయలుదేరింది. అది నాలుగు వీధులూ చుట్టి తిరిగి ఆలయానికి వచ్చేస్తుంది. దారి పొడుగునా ఇళ్ళ ముందు వీధి ఊడ్చి, నీళ్ళు చల్లి, ముగ్గులుపెట్టారు, తోరణాలు కట్టారు. రథం కొద్దిదూరం వచ్చిందో లేదో,

"ఆగండి! ఆగండి!" అన్న కేకలు మిన్ను ముట్టాయి. రథం ఆగిపోయింది.

జరిగిన దేమంటే రథం అంత దూరంలో ఉండగానే ఒక ముసలివాడు నడి వీధిలోకి వచ్చి, భక్తి పారవశ్యంలో రథం మీది దేవుణ్ణి చూస్తూ స్తంభంలా నిలబడి, తీరా రథం దగ్గిరికి వచ్చేసరికి చాపచుట్టలా సాష్టాంగం పడిపోయాడు. పడిపోయేదాకా ఆ మనిషి నెవరూ గమనించనే లేదు. పడిపోయాక ఒక్కసారిగా గొల్లున అరిచారు.

పడిపోయిన మనిషిని తాకటానికీ, ఎత్తి ఒక పక్కకు తీసుకుపోయి రథానికి దారి చెయ్యటానికీ సాహసించిన వారు లేక పోయారు. పాపన్న మటుకు, ఎవరో పడి పోయారన్న కేకలు వింటూనే రథం మోకు వదిలేసి ముందుకు వచ్చి, పడిపోయిన ముసలివాణ్ణి లేవనెత్తి నిలబెట్టుదామని ప్రయత్నించాడు. కాని, పాపన్న ఎత్తినది శవాన్ని! బండయ్య శవాన్ని!

రథం ముందు పడిపోయినది బండయ్య అని తెలియగానే రథోత్సవం సాగిస్తున్న పెద్దలు, "ఈ పాపిష్ఠి వెధవ ఇక్కడ మళ్ళీ దాపరించాడా? ఎంత ఘోరం! వీడి శవాన్ని దూరంగా తీసుకుపోయి అవతల పారేసి, వాడు పడిపోయిన చోటు పవిత్రం చేయించండి," అన్నారు.





"అందరూ పుణ్యకార్యంలో నిమగ్నులై ఉన్నవారే. నే నెలాగూ శవాన్ని తాకి మైల పడనే పడ్డాను. నేనే బండయ్య కళేబరాన్ని వా రింటికి చేరుస్తాను. ఈ లోపల మీరు పుణ్యాహవాచనమూ అదీ జరపండి. రథాన్ని కదిలించే లోపుగా నేను మైల స్నానం చేసి వచ్చి కలుసుకుంటాను," అన్నాడు పాపన్న.

ఆలయ నిర్వాహకులైన పెద్ద లీ మాట విని, "పాపన్నా, ఇప్పటికి నువు చేసినది చాలు. నిన్ను రథం తాడు పట్టనివ్వటం వల్లనే దేవు డిలా చేశాడు; ఈ అశౌచ మంతా జరిగింది! ఈసారి నువు ఘోర ప్రాయశ్చిత్తం చేసుకున్నా నిన్ను దైవకార్యంలో వేలుపెట్టనివ్వం. నీ దారిన నువు వెళ్ళు, మా తిప్పలు మేం పడతాం," అన్నారు.

పాపన్న చాలా బాధపడుతూ నిట్టూర్చి, బండయ్య శవాన్ని భుజాన వేసుకుని బండయ్య ఇంటికి వెళ్ళాడు. బండయ్య భార్య తన భర్త శవాన్ని చూసి, కన్నీరు కారుస్తూ, "పుణ్యాత్ముడు దేవుడిలో ఐక్యం అయిపోయాడు!" అన్నది.

ఆమె పాపన్న కొక వింత విషయం చెప్పింది. బండయ్య కిందటేడు దేవుడికి మొక్కుకున్నాడట: తనకు కలిగిన ఆఖరు బిడ్డ ఏడాది దాటి బతికితే తాను రథోత్సవం నాడు రథం కిందపడి బలి అవుతానన్నాడట. ఆ బిడ్డ ఏడాదిలోపు చావక బతికింది. అప్పుడు బండయ్య తన భార్యతో తన మొక్కు గురించి చెప్పేశాడు.

"అదేం మొక్కుబడి? రథం కిందపడి చచ్చి ఉత్సవమంతా పాడుచేస్తావా?" అని భార్య మందలించింది.

"నిజమేనే! నాకా సంగతి తట్టలేదు. తెలీక మొక్కుకున్నానని దేవుడికి అపరాధం చెప్పివస్తాను," అని భార్యతో అని బండయ్య రథోత్సవం జరిగేచోటికి బయలుదేరి వెళ్ళాడు. అతని శవం ఇంటి కొచ్చింది.

"నా మొగుడు దేవుడికి ప్రాణం అర్పింతా మనుకున్నాడు. అర్పించాడు! ఎవరాపగలరు?" అన్నది బండయ్య భార్య.

"అమ్మా, బండయ్యను గురించి నాకు నిజం తెలుసు. లోకం ఆ మహానుభావుణ్ణి గురించి తప్పుగా అనుకుంటున్నది. ఎవరే మనుకుంటేనేం? నిజం తెలుసుకునే దేవుడు లేడా? బండయ్యకు ఉత్తరక్రియలు నేనే జరిపిస్తాను," అని బండయ్య భార్యకు చెప్పి, రథోత్సవం మాటే మరిచిపోయి, పాపన్న ఆ పనిలో నిమగ్నుడయిపోయాడు.

ఈ లోపల రథం ఆగినచోట బ్రాహ్మలు పెద్ద తతంగం జరిపి, బండయ్యా పడిపోయిన చోటు శుద్ధి చేసి, ప్రోక్షించి, మంత్రాలు చదివి, ఇక రథాన్ని ముందుకు నడవనివ్వమన్నారు.

"హరహరా!" అంటూ భక్తులు రథం తాళ్ళు పట్టుకు లాగారు. కాని ఏ కారణం చేతనో రథం ఒక్క అరంగుళ మైనా కదలక భూమికి అంటుకు పోయినట్టు కనబడింది.

ఒక గంట గడిచింది. రెండు గంటలు గడిచాయి. రథం కదలదు!

"దేవు డాగ్రహించాడు! ఆగ్రహించకేం చేస్తాడు? ఆ పాపన్నని తాడు పట్టనిచ్చాం.



ఆ పాపిష్టివాడు రథాని కెదురుగా వచ్చి చచ్చాడు, ఉత్సవం అన్ని విధాలా అపవిత్రమైపోయింది!" అన్నారు దేవుడి పెద్దలు. ఇంతలో రథం ముందు హారతి పళ్ళెం పట్టుకున్న పూజారికి పూనకం వచ్చింది. దేవుడు పలుకుతాడని అందరూ ఆత్రంగా ఉన్నారు. పూజారి చుట్టూ జనం గుమికూడి తోసుకో సాగారు.

"ఆ పాపన్నను పిలుచుకు రండి! పాపన్న తాడు పట్టితేగాని రథం కదలదు," అన్నాడు పూజారి పూనిన ఆవేశంలో.

పెద్దలు నోరు తెరుచుకుని ఒకరి నొకరు చూసుకున్నారు.

"పాపన్నను పిలుచుకు రండి. వెంటనే పిలుచుకు రండి!" అని పూజారి కేకలు పెడుతున్నాడు.

రథోత్సవ నిర్వాహకులైన పెద్దలు అందరూ కలిసి పాపన్న కోసం అతని ఇంటికి వెళ్ళారు.

పాపన్న రథోత్సవం దగ్గిరే ఉన్నాడని పాపన్న భార్య అన్నది. వాళ్ళు బండయ్య ఇంటికి వెళ్ళారు. బండయ్య భార్య కళ్ళు తుడుచుకుంటూ, "పాపన్నగారు శ్మశానంలో ఉన్నారు. నా మొగుడికి దహనం జరిపిస్తున్నారు," అన్నది.

పెద్దలు శ్మశానానికి వెళ్ళారు. పాపన్న శ్మశానంలో చితి దగ్గిర నిలబడి ఏదో ధ్యానంలో ఉన్నాడు.

"పాపన్నా, మా వల్ల అపరాధం జరిగి పోయింది. నువు వెంటనే వచ్చి తాడు పట్టుకోవాలి, ఇవాళ రథం కదలాలి," అన్నారు దేవుడి పెద్దలు.

రథం కదలని సంగతి పాపన్న ఎరగడు. వాళ్ళకు తన పైన దురభిప్రాయం పోయి అనుగ్రహం కలిగిందనుకుని అతను, "ఇంకా మైల స్నానం చెయ్యనే లేదు. ప్రాయశ్చిత్తం చేసుకోలేదు. ఈ సారికి నన్ను వదిలెయ్యండి. దేవుడనుగ్రహిస్తే పై రథోత్సవంలో నాకు చేతనైన కైంకర్యం చేస్తాను," అన్నాడు.

పెద్దలు అతనికి రథం గురించీ, పూజారి పూనకం గురించీ చెప్పి అతన్ని ఉన్న పాళంగానే రమ్మని బతిమాలారు.

పాపన్న పరిస్థితి అర్థంచేసుకుని, ఆశ్చర్యపడి, బండయ్య చితికి ప్రదక్షిణ చేసి, తన కోసం వచ్చిన వారి వెంట వెళ్ళాడు. బండయ్య పడిపోయినప్పుడెక్కడ ఉన్నదో రథం ఇంకా అక్కడే ఉన్నది.

పాపన్న వచ్చి ఆ మైల బట్టలతోనే రథం తాడు పట్టుకున్నాడు. వెంటనే రథం కదిలింది.





# చతురురాలు

జౌలపల్లి అనే గ్రామంలో సత్తెమ్మ అనే ఒక స్త్రీ ఉండేది. ఆమె తెలివిగలది; చొరవా, సాహసమూ ఉన్న మనిషి. అందు చేతనే ఆమె, తన భర్త పోయినప్పటికీ, తన చిన్న కొడుకును తానే సంరక్షించు కుంటూ, తమ కున్న పొలాలనూ, ఇంటినీ కూడా తానే స్వయంగా చూసుకొంటున్నది.

ఒకసారి సత్తెమ్మ ఆవును కొని పాడి చెయ్యాలని నిశ్చయించింది. రాతమేటి అనే గ్రామంలో మంచి ఆవులు తక్కువ ఖరీదులో దొరుకుతాయని తెలిసింది. సత్తెమ్మ వంద వరహాలు మూట గట్టుకుని కొడుకుతో సహా రాతమేటికి బయలుదేరింది.

వాళ్ళు బయలుదేరేటప్పుడు దారిలో తినటానికి ఏమీ తెచ్చుకోలేదు; దారిలో ఏదైనా మంచి గ్రామం తగిలితే అక్కడే భోజన వసతి చూసుకుందా మనుకున్నారు. కాని దారిలో ఒకటి రెండు గూడెములూ, గుడిసెలూ తప్ప గ్రామం ఏదీ తగలలేదు. తల్లి కొడుకు లిద్దరూ చాలా అలిసిపోయి, బాగా ఆకలి గొని ఉన్నారు. వారికి ఒక చోట తాగడానికి నీరు దొరికింది గాని తినటానికి తిండి మాత్రం దొరకలేదు.

ఇంతలో దారిలో వారి కొక మనిషి ఎదురుపడ్డాడు. అతని నెత్తిన అరటిపళ్ళ గెల ఉన్నది. అది చూడగానే సత్తెమ్మకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె ఆ మనిషిని ఆపి, పళ్ళెలా ఇస్తావని అడిగింది. వాడు వట్టి ఆశాపాతకుడు. తల్లి కొడుకులు ఆకలి మీద ఉన్నారనీ, డబ్బు గుంజటానికి మంచి అవకాశమనీ గ్రహించి, వాడు పండు పావలా చేసి ఇస్తానన్నాడు.

వాడి దురాశ చూసి సత్తెమ్మ మండి పడింది. ఆమె తన కొడుకుతో సహా ముందుకు కదులుతూ, "నీ పళ్ళు మాకు వద్దులే!" అన్నది.

జి. రాజగోపాలరావు



ఏదోకాడికి బేరం జరగకపోదనే ధైర్యంతో అరటిపళ్ళ గెలవాడు ఒక చెట్టు దగ్గిరికి వెళ్ళి దాని నీడన గెల పెట్టుకుని కూర్చున్నాడు.

కొంత దూరం నడిచి సత్తెమ్మ తన కొడుక్కు ఏదో రహస్యంగా చెప్పింది. తరవాత ఇద్దరూ వెనక్కు తిరిగి వచ్చారు.

"పిల్లవాడు ఆకలో అని ఏడుస్తున్నాడు. రెండు పళ్ళియ్యి," అన్నది సత్తెమ్మ.

గెలగల మనిషి కుర్రాడి చేతిలో రెండు పళ్ళు తుంచి పెట్టాడు. అందులో ఒకటి తిని కుర్రాడు కెవ్వున అరిచి, కిందపడి గిలగిలా తన్నుకున్నాడు.

"ఓరి చండాలుడా! నా కొడుక్కి విషం పెట్టి ప్రాణం తీశావు్రా?" అంటూ సత్తెమ్మ గట్టిగా గొంతెత్తి కేకలూ, శాపనార్థాలూ పెడుతూ ఏడవసాగింది.

ఈ కేకలు విని వాళ్ళ వేపు వస్తున్న ఇద్దరు ముగ్గురు ప్రయాణీకులు కర్ర లెత్తి పరిగెత్తుకుంటూ రాసాగారు. అది చూసి అరటిపళ్ళ గెలవాడు గెలను చెట్టు కిందే వదిలి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు.

దగ్గిరికి వచ్చి ప్రయాణీకులు, "ఏం జరిగింది?" అని సత్తెమ్మ నడిగారు.

"పాపిష్టివాడు! మేం దారిలో తినటానికి తెచ్చుకున్న అరటి పళ్ళు కాజేద్దామను కున్నాడు. నా కొడుకును కొట్టాడు. మీరు సమయానికి వచ్చారు గనుక సరిపోయింది. లేకపోతే నా గతీ, ఈ పసి వెధవ గతీ ఏం కాను?" అన్నది సత్తెమ్మ. ఆమె గెలలో నుంచి అరటిపళ్ళు తుంచి వాళ్ళకు తలా నాలుగూ పంచి పెట్టింది.

సత్తెమ్మ కొడుకు అంతకు ముందే లేచి కూర్చున్నాడు. అందరూ తినగలిగినన్ని పళ్ళు తిన్నాక సత్తెమ్మ మిగిలిన పళ్ళు మూట గట్టుకుని, కొడుకుతో కదిలి, సూర్యాస్తమయం వేళకు రాతమేటి గ్రామం చేరింది.

గ్రామం చేరుతూనే మొట్టమొదట తగిలిన ఇంటనే ఆమె ఆవులను అమ్మేవారిని గురించి వాకబు చేసింది. గ్రామం మధ్యన చెంచన్న అనే రైతు ఉన్నాడనీ, అతని దగ్గిర ఆవులు అమ్మకాని కున్నాయనీ ఆ ఇంటివాళ్ళు చెప్పారు.

సత్తెమ్మ చెంచన్న ఇంటికి కొడుకుతో సహా వెళ్ళింది. ఆవులను చూసింది. అవి బాగానే ఉన్నాయి. లేగతో సహా ఒక ఆవును డెబ్బైఅయిదు వరహాలకు బేరం చేసి, డబ్బిచ్చింది. తానూ తన కొడుకూ ఆ రాత్రికి చెంచన్న ఇంటనే భోజనం చేసి, నిద్రపోయి మర్నాడు తెల్లవారుజామున ఆవునూ, దూడనూ తోలుకుపోతామని ఆమె చెంచన్నతో అన్నది.

ఆ రాత్రి భోజనాలయాక తల్లి కొడుకులకు వసారాలో పక్క వేశారు. అర్థరాత్రి దాటిన తరవాత చెంచన్న లోపలి నుంచి వసారా లోకి వచ్చి చిన్న గొంతుతో, "నిద్ర పోతున్నారల్లే ఉందే!" అన్నాడు.

సత్తెమ్మ మేలుకునే ఉన్నది, కాని చెంచన్న ఉద్దేశమేమిటో తెలుసుకుందామని నిద్రపోతున్నట్టు నటించింది. చెంచన్న ఆ తల్లికొడుకులు పడుకున్న చాప చుట్టూ తడివి చూసి, ఏమీ దొరకక, లోపలికి వెళ్ళిపోయాడు.





అతను తలుపు వేసుకోగానె సత్తెమ్మ లేచి, చప్పుడు చెయ్యకుండా తలుపు దగ్గిరికి వెళ్ళి ఆలకించింది.

"ఏమీ దొరకలేదా ?" అని చెంచన్నను భార్య అడిగింది.

"తెల్లారనీ. ఆ మిగిలిన పాతిక వరహాలూ మరో విధంగా గుంజుతాను," అన్నాడు చెంచన్న తన భార్యతో.

సత్తెమ్మ డెబ్బైఅయిదు వరహాలు ఎంచి ఇచ్చేటప్పుడు, ఆమె సంచీలో మరి ఇరవైఅయిధు వరహా లుండటం గమనించి, ఆ సంచీ కాజెయ్యాలని చెంచన్న చూచాడు. కాని సత్తెమ్మ పడుకునే టప్పుడు డబ్బుల సంచీని తల దగ్గిర పెట్టుకోక, చాప కిందా పెట్టక, రొండినే ఉంచుకున్నది.

చెంచన్నకు బుద్ధి చెప్పాలనే ఉద్దేశంతో సత్తెమ్మ తన కొడుకును లేపి, "పశువుల కొట్టం లోకి వెళ్ళి, రెండావులను విప్పి, చెరొక పక్కా తోలి వెంటనే తిరిగిరా," అని చెప్పింది.

వాడు లేచి వెళ్ళి రెండు ఆవులను కట్లు విప్పి వదిలేసి, చెరొక వైపూ తోలి, ఆవు లాగా అరిచి, తిరిగి తన చోటికి వచ్చి ఏమీ ఎరగనట్టు పడుకున్నాడు.

తన ఆవు లెందుకు అరిచాయో నని చూడటానికి చెంచన్న దీపం వెలిగించి పశువుల శాల లోకి వెళితే రెండావులు లేవు. అతను తన భార్యను కూడా లేపి, దీపం గడప లోనే ఉంచి, ఆవుల కోసం భార్యనొక పక్కకు వెళ్ళమని చెప్పి తా నొక పక్కకు వెళ్ళాడు.

వాళ్ళు వెళ్ళగానే సత్తెమ్మ లేచి దీపం తీసుకుని ఇంట్లోకి వెళ్ళి, తా నిచ్చిన డెబ్భై అయిదు వరహాలను చెంచన్న పెట్టెలో దాచటం చూసి ఉన్నది గనుక, వాటిని తీసుకుని తన సంచీలో పోసేసుకుని, పెట్టె మూసి వచ్చి, దీపం గుమ్మంలో పెట్టేసి మళ్ళీ పడుకున్నది.

చెంచన్నా, అతని భార్యా చెరొక ఆవునూ పట్టుకుని తీసుకువచ్చి, పశువుల కొట్టంలో కట్టేసి మళ్ళీ పడుకున్నారు.

తెల్లవారింది. సత్తెమ్మ చెంచన్నతో, "ఇంక బయలుదేరతాం, అన్నయ్యగారూ. రాత్రి మంచి నిద్ర పట్టింది. మా ఆవునూ, దూడనూ మా కిప్పించండి," అన్నది.

"పాతిక వరహా లిచ్చి ఆ రెండిటినీ తోలుకుపొండి," అన్నాడు చెంచన్న.

"పాతిక వరహాలివ్వాలా? దేనికీ?" అన్నది సత్తెమ్మ.

"రాత్రి మీరు తిన్నందుకూ, ఉన్నందుకూ, మీ పశువుల మేతకూనూ. మీకు తెలీదా? అది మా గ్రామంలో రివాజు," అన్నాడు చెంచన్న.

తనకు తెలియనందుకు చాలా అవమాన పడుతున్నట్టుగా నటించి సత్తెమ్మ తన సంచీలో నుంచి ఇరవైఅయిదు వరహాలు తీసి చెంచన్న కిచ్చి, ఆవునూ, దూడనూ తోలుకుని కొడుకుతో బయలుదేరింది. చెంచన్న భలే సంతోషించాడు.

తిరిగి వచ్చేటప్పుడు ఊరి చివర ఉండే ఇంటి దగ్గిర ఆగి సత్తెమ్మ ఇంటి వాళ్ళతో. "మీరు చెప్పినట్టే చెంచన్నగా రింటికి వెళ్ళి ఆవూ, దూడా కొన్నామండీ. వెళ్ళొస్తాం," అన్నది.



ఆ ఇంటావిడ సత్తెమ్మతో, "మీ రుండేది జాలపల్లి అన్నారుకదూ? మా అమ్మాయిని మీ జాలపల్లిలో కన్నయ్యగారి అబ్బాయికే ఇచ్చాం. సీకాయపొడి దొరక్క మా పిల్ల చాలా ఇబ్బంది పడుతున్నదిట. ఒక డబ్బాలో సీకాయపొడి ఇస్తాను, కొంచెం తీసుకెళ్ళి దాని కివ్వండి. మీకు పుణ్యం ఉంటుంది," అన్నది.

"దానికేం భాగ్యమమ్మా? అలాగే ఇస్తాను," అన్నది సత్తెమ్మ.

ఇంటావిడ తాళ్ళతో మహా భద్రంగా కట్టి ఉంచిన డబ్బా ఒకటి తెచ్చి సత్తెమ్మ కిచ్చింది. దాన్ని తీసుకుని తల్లి కొడుకులు దారి పట్టారు.

ఎండవేళ వాళ్ళు దారి పక్కన ఉన్న ఒక చెట్టు కింద పడుకుని కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు.

కొంత సేపయాక కుర్రవాడు లేచి, తాళ్ళు బిగించిన డబ్బా కేసి చూసి, "అమ్మా, ఈ సీకాయకి చీమలు పట్టుతున్నాయి!" అన్నాడు.

సత్తెమ్మ చూసేసరికి చీమలు బారుగా డబ్బా మీద పాకుతూ, మూత కేసి పోవటం కనబడింది. ఆమె కట్లన్నీ విప్పి, డబ్బా మూత తీసి చూసింది. డబ్బా నిండా పెద్ద పెద్ద లడ్డూ లున్నాయి.

తల్లి కొడుకులు కొన్ని లడ్డూలు తిని, తిరిగి డబ్బాకు మూత పెట్టేసి తమ గ్రామానికి పట్టుకుపోయారు.

తరవాత సత్తెమ్మ డబ్బా నుంచి లడ్డూలన్నీ తీసేసి దాని నిండా సీకాయపొడి నింపి, కట్లు కట్టి, కన్నయ్యగా రింటికి పట్టుకెళ్ళి, "మీ వియ్యాలవారు మీ కోడలి కోసం సీకాయపొడి పంపారు," అని చెప్పి వాళ్ళకు ఇచ్చేసింది.

ఆ డబ్బాలో నిజంగా సీకాయపొడి ఉండటం చూసి కన్నయ్య కోడలు నిర్ఘాంతపోయింది!





# అసలు హంతకుడు

పూర్వం ఒక గ్రామంలో శుద్ధాంకు డనే గురువు ఉండి ఒక గురుకులం నడిపే వాడు. అనేక మంది విద్యార్థులు ఆయన వద్ద చదువుకునే వారు.

ఒకనాటి రాత్రి ఎవరో అసూయాపరు లొక మనిషిని కత్తితో పొడిచి చంపి, అ కత్తితో సహా శవాన్ని శుద్ధాంకుడి ఇంటి ముందు పెట్టి వెళ్ళిపోయారు.

తెల్లవారుతూండగా శుద్ధాంకుడు తలుపు తెరిచి శవాన్ని చూసి, అందులో ఉన్న కత్తిని పైకి లాగాడు. అ సమయంలో ఊళ్ళో వాళ్ళు కొందరు శుద్ధాంకుణ్ణి చూసి, శుద్ధాంకు డెవరినో హత్య చేశాడనీ, తాము కళ్ళారా చూశామనీ ఊరంతా చెప్పారు.

రాజభటులు వచ్చి శుద్ధాంకుడి పైన హత్యా నేరం మోపి, ఆయనను బళ్ళాల రాజు దగ్గిరికి తీసుకుపోయారు. విచారణ జరిగింది. శుద్ధాంకుడు రక్తమయమైన కత్తిని చేతబట్టుకుని చచ్చిపోయిన మనిషి కళేబరం దగ్గిర నిలుచుని ఉండగా చూశామని కొందరు సాక్ష్యం చెప్పారు. హత్య అయిన మనిషి శుద్ధాంకుడికి బొత్తిగా తెలియని మనిషి కాడు; ఆ మనిషి దగ్గిర శుంద్ధాంకుడు కొద్ది మాసాల క్రితం ఒక గోవును కొన్నాడు. ఆ సందర్భంలో ఇద్దరికీ ఏదైనా మనస్పర్థ ఏర్పడి ఉండవచ్చు.

శుద్ధాంకుడు హత్య చెయ్యలే దనటానికి గాని, ఆ హత్య మరొకరి వల్ల జరిగిం దనటానికి గాని ఆధార మేదీ దొరకని కారణంచేత బళ్ళాలరాజు శుద్ధాంకుణ్ణి దోషిగా నిర్ణయించి, మరణదండన విధిస్తూ, "నీ ఆఖరి కోరిక ఏమైనా ఉంటే చెప్పు," అన్నాడు.

"నేను దోషినో, కానో ఆ ఈశ్వరుడికి ఒక్కడికే తెలుసు. ఏమైనా నాకు రెండు వారాలు గడువిస్తే, నా వ్యవహారాలన్నీ

ఎల్. రామశర్మ



చక్కబెట్టుకుని వచ్చి శిక్ష పొందగలను," అన్నాడు శుద్ధాంకుడు.

"నీకు బదులుగా ఎవరన్నా ఉండే పక్షంలో నిన్ను రెండు వారాలపాటు వదిలి పెట్టగలను. నీవు తిరిగి రాకపోతే నీకు విధించిన శిక్ష అతడు పొందటానికి సిద్ధంగా ఉండాలి," అన్నాడు రాజు.

"నాకు అలాటి వాళ్ళెవరూ లేరు," అన్నాడు శుద్ధాంకుడు.

శుద్ధాంకుడికి చాలామంది శిష్యులున్నారు. వాళ్ళను ఆయన తనకు బదులుగా ఉండమని కోరి ఉండవచ్చు. కాని శుద్ధాంకుడికసలు అలాటి ఆలోచనే కలగకపోవటం రాజు గమనించాడు. శుద్ధాంకుడి లాటి వ్యక్తి హత్య చేసి ఉంటాడనీ, హత్య చేసే మనస్తత్వం ఆయనకున్నదనీ రాజుకు ఏమాత్రమూ నమ్మకం లేదు. నిజం తెలుసుకునేటందుకూ, వీలయితే అసలు హంతకుణ్ణి పట్టుకోవటానికీ రాజు తన మనస్సులో మార్గాలు వెతుకుతూనే ఉన్నాడు. ఆయనకిప్పుడొక మార్గం కనబడింది. ఆయన శుద్ధాంకుడితో, "నీకు బదులుగా ఉండేవారెవరూ లేకపోతే నేనే ఉంటాను. నీవు ఇవాళే మీ ఊరికి వెళ్ళిపోయి, రెండు వారాలపాటు నీ వ్యవహారాలన్నీ చక్కబెట్టుకుని పదిహేనో నాడు సూర్యాస్తమయం లోపల తిరిగి రా. పదహారో రోజు మధ్యాహ్నం లోపల నిన్ను కొరత వేయిస్తాను," అన్నాడు.

శుద్ధాంకుడు రాజుకు కృతజ్ఞత తెలుపుకుని, తన గ్రామానికి తిరిగి వెళ్ళి తన గురుకులం సక్రమంగా నడవటానికీ, తన భార్యా, బిడ్డలూ సుఖంగా బతకటానికీ తగిన ఏర్పాట్లన్నీ ఒక వారం రోజులలో ముగించి, మిగిలిన వారం తపస్సు చేసుకుందామని అడవికి వెళ్ళి, అక్కడ ఉండిపోయాడు.

ఈ విధంగా పధ్నాలుగు రోజులు గడిచిపోయాయి. మర్నాడు తెల్లవారగానే బయలు



దేరి సాయంకాలం లోపల రాజధానికి చేరు కుందా మనుకుని శుద్ధాంకుడు పధ్నాలుగో రాత్రి తన కుటీరంలో పడుకున్నాడు. కాని ఆ రాత్రే నలుగురు దొంగల లాటి వాళ్ళు గుర్రాల పైన వచ్చి, శుద్ధాంకుణ్ణి బంధించి, కళ్ళకు గంతలు గట్టి తీసుకు పోయారు.

"నాయనలారా, నన్ను పట్టుకుంటే మీకేం లాభం? నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. నన్ను వదిలెయ్యండి. లేదా నన్ను రాజధానికి చేర్చండి, మీకు పుణ్యం ఉంటుంది. ఎల్లుండి నన్ను రాజుగారు కొరత వేయిస్తారు. రేపటికి నేను రాజధానికి చేరుకుని తీరాలి," అని శుద్ధాంకుడు దొంగలను వేడుకున్నాడు. కాని వాళ్ళు జవాబు చెప్పలేదు.

చివరకు ఆ దొంగలు శుద్ధాంకుణ్ణి ఒక కొట్టులో పెట్టి తాళం వేసి వెళ్ళిపోయారు. వెళ్ళే ముందు వాళ్ళు ఆయన చేతి కట్లు విప్పేశారు. అందుచేత ఆయన తన కళ్ళ గంతలు విప్పేసుకున్నాడు. గాఢాంధకారం తప్ప ఆయన కింకేమీ కనిపించ లేదు.

పదిహేనో రోజు సాయంత్రం శుద్ధాంకుడి గ్రామం నుంచి ఒకడు వచ్చి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, మీరు శుద్ధాంకుణ్ణి చెయ్యిదాటి పోనిచ్చి పొరపాటు చేశారు. అతనిది మా గ్రామమే. వారం రోజులుగా అతను మా గ్రామంలో కనిపించటం లేదు. ఇంతవరకు రాజధానికి కూడా రాలేదని విన్నాను," అన్నాడు.

రాజీ మాట విని ఆ మనిషితో, "మాకు సహాయం చెయ్యాలని నీకు కలిగిన ఆసక్తి చాలా మెచ్చుకోదగినది. హంతకుడి సంగతి నేను చూస్తాను. అతనికి మరణ దండన పడే దాకా నీవు మా అతిథివిగా ఉండు," అన్నాడు. ఆ మనిషి రాజభవనంలో చిక్కుకు పోయాడు. అతని చుట్టూ నలుగు రైదుగురు రాజభటులు ఉంటూ వచ్చారు.

మర్నాడు హంతకుడికి కొరత శిక్ష విధిస్తారని చాటింపు జరిగింది. ఝాము

పొద్దెక్కే లోపల వధ్యస్థానం వద్ద వేలకు వేలు జనం పోగయారు. కిందటి సాయం కాలం తన వద్దకు వచ్చిన మనిషిని వెంట బెట్టుకుని రాజు కూడా అక్కడికి వచ్చాడు.

"మహారాజా, శుద్ధాంకుడు పారి పోయాడు; శిక్ష తప్పించుకున్నాడు. ఎవరిని శిక్షిస్తారు? ఈ ఏర్పాట్లన్నీ దేనికి? ఎలాగైనా హంతకుణ్ణి వెతికించండి," అన్నాడు శుద్ధాం కుడి గ్రామం నుంచి వచ్చిన మనిషి.

"శిక్ష జరిగి తీరవలిసిందే. శుద్ధాంకుడు కాకపోతే అతనికి పూచీ ఉన్న నేనే కొరత బడతాను. కాకపోయినా శుద్ధాంకుడు కొరత పడాలని నీ కింత ఆదుర్దా దేనికి?" అన్నాడు రాజు. ఆ మనిషి తెల్లబోయాడు. రా జతన్ని విడిచిపెట్టక ప్రశ్న మీద ప్రశ్న వేసి ఆ మనిషి చేత కొంచెం కొంచెంగా నిజమంతా బయట పెట్టించాడు. ఆ మనిషి శుద్ధాంకుడి దగ్గిర బంధువే; దాయాది. రెండు కుటుం బాల మధ్య చాలా కాలంగా తగాదా లున్నాయి. ఒక అడమనిషి కారణంగా ఈ దాయాది తమ ఊరి పశువుల వ్యాపారిని హత్య చేసి, శుద్ధాంకుడి పైన పగ తీర్చుకునే టందుకు శవాన్ని తెచ్చి శుద్ధాంకుడి ఇంటి ముందు పెట్టాడు.

ఈ విషయాలన్నీ రాజు అసలు హంత కుడి నుంచి రాబట్టుతున్న సమయంలో రాజభటుల వెంట శుద్ధాంకు డక్కడికి రానే వచ్చాడు. అతన్ని అడవిలో పట్టుకుని తీసుకువచ్చి దొంగల వేషంలో రాజభటులే చీకటి కొట్టులో ఉంచారు. ఆ పని జరి పించిన వాడు బళ్ళాల రాజే.

ఆయన శుద్ధాంకుడితో, "అయ్యా, మీరు నిర్దోషి అని తేలింది. మీరిక స్వేచ్ఛగా వెళ్ళవచ్చు. అసలు హంతకుణ్ణి యిప్పుడే కొరత వేయిస్తున్నా!" అన్నాడు.

శుద్ధాంకు డెక్కుతాడని ఊహించిన కొరత పై దాయాది తానే ఎక్కి చేసిన తప్పుకు శిక్ష అనుభవించాడు.





# కపట దాతృత్వం

ఒకానొక ఊళ్ళో సుప్రతిష్ఠు డనే ధనికు డుండేవాడు. ఆయనకు లోభ బుద్ధితోబాటు నలుగురిలోనూ ప్రతిష్ఠ సంపాదించుకోవా లన్న కోరిక కూడా ఉండేది. ఎవరైనా అతిథి అభ్యాగతులూ, ముష్టివాళ్ళూ వచ్చి నప్పుడు, తన ఇంట పైవా రెవరైనా ఉంటే అతిథ్యం ఇచ్చేవాడు, ధర్మం చేసేవాడు; తాను ఒంటరిగా ఉంటే నిర్దాక్షిణ్యంగా తరిమేసే వాడు. ఆతిథ్యం ఇచ్చినప్పుడు కూడా అతిథులకు పెట్టేటందుకు చచ్చు రకం వంట చేయించే వాడు తప్ప, తానూ, తన భార్యా, పిల్లలూ తినే భోజనం పెట్టే వాడు కాడు.

ఒకనాటి మధ్యాన్నం సుప్రతిష్ఠుడు ఎవరో ప్రముఖులతో మాట్లాడుతున్న సమ యంలో ఒక జడదారి బైరాగి వచ్చి, "నేను మీ యింటికి అతిథిగా వచ్చాను. భోజనం పెట్టండి," అని అడిగాడు.

సుప్రతిష్ఠుడు సరేనని, ఒక సేవకుణ్ణి పిలిచి, "ఈ యనను తీసుకుపోయి, భోజనం పెట్టి పంపించు," అన్నాడు.

సేవకుడు బైరాగిని బిచ్చగాళ్ళకు తిండి వేసే చోటికి తీసుకుపోయి, ఒక అకులో కొంచెం నూకల అన్నమూ, పచ్చడీ వేసి తీసుకొచ్చి ఆ బైరాగి ముందు పెట్టాడు.

ఆ బైరాగి ఆ అకు కేసి చూసి, సేవ కుడితో కోపంగా, "నీ యజమానిని పిలుచుకురా!" అన్నాడు.

సేవకుడు భయపడుతూ తన యజమాని దగ్గిరికి వెళ్ళి బైరాగి పిలుస్తున్నాడని చెప్పాడు. అప్పటికి ప్రముఖులు వెళ్ళి పోయి ఉండటం చేత సుప్రతిష్ఠుడు బైరాగి వద్దకు వచ్చి, "ఏమిటోయ్?" అని అడిగాడు.

"నన్ను మామూలు బిచ్చగాడి కింద జమకట్టక, మీ రందరూ చేసే భోజనమే

ఎం. ఎస్. అంజనేయులు



పెట్టించండి. మీకు మేలు కలుగుతుంది," అన్నాడు బైరాగి.

"పెట్టింది తినక అధికారం చేస్తా వేమిటి? అంత జిహ్వాచాపల్యం గల వాడివి బైరాగి వేషం వేసుకు తిరగటం దేనికి?" అన్నాడు సుప్రతిష్ఠుడు.

"జిహ్వాచాపల్యం అంత సులువుగా పోతుందా? నే నొక సాధకుణ్ణి. హిమాలయా నికి పోతూ మీ ఇల్లు చూసి మంచి భోజనం దొరుకుతుందని వచ్చాను. నా అవతారం చూసి మీరు మరోవిధంగా అనుకున్నందుకు నా కేమీ కోపం లేదు. నాకు మీ భోజనమే కావాలి. మీకు కొత్తగా దొరికిన వస్తువేదన్నా ఉంటే నాకు చూపండి. మీకు మంచి కలిగే లాగు చేస్తాను. నాకు పెట్టినది వృథా పోదు," అన్నాడు బైరాగి.

ఆ మాట విని సుప్రతిష్ఠుడు చకితుడై, బైరాగి కేసి తీక్షంగా చూసి, తన సేవకుడితో, "ఈ బైరాగి వెధవని అవతలికి గెంటెయ్యి!" అని స్నానం చేయటానికి ఇంటి లోపలికి వెళ్ళిపోయాడు.

బైరాగి కూడా అక్కడి నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

ఇదంతా గమనించిన వంట కుర్రవాడు, పాత్రలలో మంచి మంచి వంటకాలు పెట్టుకుని, దొడ్డి గుమ్మం ద్వారా పరిగెత్తుకుంటూ పోయి, ఒక వీధి మలుపులో బైరాగిని కలుసుకుని, "మంచి భోజనం తెచ్చాను. తినండి," అన్నాడు.

తాను ఆ ఇంటి వంటవాణ్ణనీ, బైరాగి ఆకలితో వెళ్ళి పోవటం తన కేమీ బాగా లేదనీ వాడు చెప్పాడు.

"ఆ లోభివాడి భోజనం నా కవసరం లేదు," అన్నాడు బైరాగి.

"వంటలో ఇది నా వంతనుకుని భోజనం చెయ్యండి," అన్నాడు వంటవాడు.

"నీ వంతు నాకు పెట్టేసి పస్తుపడు కుంటావా? అలా కుదరదు. నాతోబాటు

నువుకూడా తినేట్టుంటే నేను భోంచేస్తాను," అన్నాడు బైరాగి.

వంటకుర్రవా డందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి ఒక చెట్టు కింద కూర్చుని భోజనం చేశారు.

"నువ్వు ఈ రోజు నా ఆకలి తీర్చావు. నీకు మేలు కలిగే మాట ఒకటి చెబుతాను. అదుగో, దూరంగా కనిపించే ఆ కొండకు అవతల అడవిలో ఒక పాడుబడిన మంటపం ఉన్నది. అక్కడికి పోయి రాత్రంతా లక్ష్మీ మంత్రం జపిస్తూ ఉండే వాడికి తెల్లారగానే, ఇహ సౌఖ్యాలను సాధించే వస్తువు దొరుకుతుంది," అని చెప్పి, బైరాగి వంటవాణ్ణి దీవించి, అక్కడి నుంచి కదిలాడు.

వంట కుర్రవాడు ఖాళీపాత్రలు తీసుకుని ఇంటికి తిరిగి వస్తుండగా సుప్రతిష్ఠుడు అడావుడిగా వాణ్ణి సమీపించి, "ఎక్కణ్ణుంచి వస్తున్నావు? ఆ బైరాగి ఏమయాడు?" అని అడిగాడు.

"అటుగా వెళుతున్నాడండీ," అని వంటవాడు చెప్పగానే సుప్రతిష్ఠుడు అటుగా పరిగెత్తాడు.

బైరాగికి భోజనం పెట్టినందుకు యజమాని ఏం శిక్షవేస్తాడో నని భయపడిన వంటవాడికి గండం గడిచి నట్లయింది.



సుప్రతిష్ఠుడు బైరాగి కోసం పరిగెత్తటానికి కారణం ఉన్నది. తోటలో కొత్త పాదులు తవ్వుతూంటే ఆ ఉదయం ఒక నిధి బిందె దొరికింది. దాని నిండా బంగారు నాణాలున్నాయి. సుప్రతిష్ఠుడు దాన్ని ఒక మూల దాచి పెట్టాడు. బైరాగి కొత్తవస్తువని అనగానే ఆ బిందె మాట జ్ఞాపకం వచ్చింది. బైరాగి వెళ్ళాక అయన స్నానం చేసివచ్చి చూసుకుంటే బిందె ఖాళీగా ఉంది! బైరాగి సామాన్యుడు కాడనీ, మంత్రమహిమతో అతనే ఆ బిందెలోని ధనం కాజేసి ఉంటాడనీ, మంచిగానే కార్యసాధన చేసుకోవాలనీ అనుకుని సుప్రతిష్ఠుడు బైరాగి వెళ్ళిన దిక్కుగా వెళ్ళాడు. బైరాగి ఆ సరికి ఊరు దాటి చేలకు అడ్డంపడి నడిచిపోతున్నాడు.

అయన బైరాగిని అందుకుని, వినయంగా నమస్కారం చేసి, "స్వామీ, మీ మహిమ తెలీక అజ్ఞానంగా ఏమేమో వాగేశాను. నన్ను క్షమించి నా ఆతిథ్యం స్వీకరించండి. నాకు దొరికిన కొత్తవస్తువు మాయ మయింది. అది నాకు తిరిగి దొరికేటట్టు అనుగ్రహించండి," అన్నాడు.

"నా ఆకలి తీరిపోయింది. కాని కావాలంటే ఒక సలహా ఇస్తాను. అదుగో, ఆ దూరంగా కనిపించే కొండ అవతల అడవిలో ఒక పాడుబడిన మంటపం ఉన్నది.



అక్కడికి పోయి రాత్రంతా లక్ష్మీ మంత్రం జపిస్తూ ఉండే వాడికి తెల్లారగానే, ఇహ సౌఖ్యాలను సాధించే వస్తువు దొరుకుతుంది," అని వంట కుర్రవాడికి చెప్పినట్టే చెప్పి, బైరాగి వెళ్ళిపోయాడు.

చేసేదిలేక సుప్రతిష్ఠుడు ఇంటికి తిరిగి వచ్చి, ఆ రోజల్లా ఆరాటపడి, మర్నాడు బైరాగి చెప్పినట్టు చెయ్యటానికి నిశ్చయించాడు. ఆయన ఆహారం మూట కట్టుకుని, కత్తి కర్ర చేత పట్టుకుని కొండ కేసి బయలుదేరాడు.

అక్కడికి ఒక పూట ప్రయాణం. మధ్యాన్నం వేళ ఆకలి వేసి ఆయన ఒక చోట కూర్చుని ఆహారం మూట విప్పాడు. అంతలో ఒక ముసలాడు వచ్చి, "చాలా ఆకలిగా ఉంది. ఒక ముద్ద వెయ్యండి," అని అడిగాడు.

ఊళ్ళోకి పోయి అడుక్కోమని సుప్రతిష్ఠుడా ముసలివాణ్ణి కసిరికొట్టాడు. ఆయన తిండి తిని బయలుదేరుతుండగా ఒక ముసలిది, ఏడుస్తున్న చిన్న పిల్లతో సతమతమవుతూ, "బాబూ, పిల్లముండ ఎత్తుకోమని ఏడుస్తున్నది. నెత్తిన కట్టెలమోపు పెట్టుకుని పిల్ల నెట్లా ఎత్తుకునేది? కాస్త మీరు దాన్నెత్తుకుని ఆ కనబడే గుడిసె దాకా రండి," అన్నది.



"నా కిదే పనా? కట్టెలు తేబోయ్యేదానివి పిల్ల నెందుకు వెంటరానిచ్చావూ? పదపద!" అంటూ సుప్రతిష్ఠుడు ముందుకు సాగాడు. ఆయన కొండ దాటగానే ఒక గుడ్డివాడు మనిషి అలికిడి విని, "ఎవరో పుణ్యాత్ములు! నా చేతికర్ర పారేసుకున్నాను, ఒక కొమ్మ విరిచి కాస్త చేతికర్ర చేసి ఇద్దురూ!" అన్నాడు దీనంగా.

సుప్రతిష్ఠుడా గుడ్డివాడి గొడవ పట్టించుకోకుండా ముందుకు సాగి, అడవి ప్రవేశించి మంటపం చేరుకున్నాడు. క్రూరమృగాల బాధ లేకుండా, ఎండు కట్టెలు పేర్చిపెట్టి మంట వేసి, కత్తి కర్ర తీసి పక్కన పెట్టుకుని, తెల్లవార్లూ మేలుకుని లక్ష్మి మంత్రం జపించాడు.

తెల్లవారింది. ఆయనకు లక్ష్మి దర్శనమివ్వలేదు. ఏ వస్తువూ దొరకలేదు. దొంగ బైరాగి మోసపుచ్చాడనుకుని, ఆ బైరాగిని కసి తీరా తిట్టుకుని సుప్రతిష్ఠుడు ఇంటికి తిరిగి వెళ్ళి, బైరాగికి అన్నం పెట్టినందుకు వంట కుర్రవాణ్ణి ఇంటి నుంచి తరిమేశాడు.

ఆ కుర్రవాడికి తల్లీ, చెల్లెలూ ఉన్నారు. వాళ్ళను పోషించే భారం వాడిపైనే ఉన్నది. అందుచేత వాడు బైరాగి చెప్పినట్టే చేద్దామనుకున్నాడు. వాడు కూడా కాసిని రొట్టెలు మూటగట్టుకుని కొండ కేసి బయలుదేరాడు. దారిలో బిచ్చగాడికి ఒక రొట్టె ఇచ్చాడు. కట్టెలు మోసుకుపొయ్యే మనిషి కూతుర్ని వాళ్ళ గుడిసె దాకా మోసుకుపోయాడు. గుడ్డివాడికి చేతికఱ్ర చేసి ఇచ్చాడు. చీకటి పడే వేళకు మంటపం చేరి లక్ష్మి మంత్రం చదువుతూ చదువుతూనే నిద్రపోయాడు. ఎంత ప్రయత్నించినా తెల్లవార్లూ మేలుకోవటం వాడికి సాధ్యం కాలేదు.

అయినా వాడు మర్నాడు పొద్దున నిద్ర లేచేసరికి వాడి పక్కన ఒక బంగారు నాణాల మూట ఉన్నది. దానితో వాడి దరిద్రం తీరిపోయి సుఖంగా ఉన్నాడు.





# యుద్ధకాండ

రాముడి దెబ్బకు తట్టుకోలేక రావణుడు పారిపోయాడు. తరవాత రాముడు లక్ష్మణుడు పడిఉన్న చోటికి వచ్చి, ఊపిరి బరువుగా తీస్తూ కొన ప్రాణంతో ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అధైర్యపడిపోయాడు. లక్ష్మణుడికి ప్రాణభయం ఉండదని సుషేణుడు రాముడికి ధైర్యం చెప్పి, హనుమంతుడితో, "జాంబవంతుడు చెప్పిన ఓషధీ పర్వతానికి వెళ్ళి, దాని దక్షిణ శిఖరం పైన ఉండే నాలుగు రకాల ఓషధులూ తీసుకురా," అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం దగ్గిరికి వెళ్ళాడు. కాని ఆ ఓషధు లేవో అతనికి తెలియలేదు. అందుచేత అతను మొత్తంగా శిఖరాన్నే తీసుకు పోదామనీ, లక్ష్మణుడికి కావలిసిన ఓషధి ఆ శిఖరం మీద ఎక్కడో ఉండకపోదనీ అనుకున్నాడు. అతనా పర్వత శిఖరాన్ని మూడు సార్లు అటూ ఇటూ కుదిలించి, పెకలించి తీసుకుపోయి యుద్ధభూమిలో వాలి, "నువు చెప్పిన మూలికలు గుర్తు తెలియక శిఖరాన్ని మొత్తంగా పెరికి తెచ్చాను," అని సుషేణుడితో చెప్పాడు.

సుషేణుడు తనకు కావలిసిన ఓషధిని పెల్లగించి, నలిపి, దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు. దాని వాసన తగలగానే లక్ష్మణుడు లేచి కూర్చున్నాడు. రాముడు తన తమ్ముణ్ణి ఆలింగనం చేసుకుని ఆనందబాష్పాలు రాలుస్తూ, "లక్ష్మణా, నా అదృష్టం కొద్దీ నీవు చచ్చి మళ్ళీ



బతికావు. నువ్వే పోయిఉంటే నాకు సీత దేనికి? యుద్ధంలో విజయం దేనికి?" అన్నాడు.

అది విని లక్ష్మణుడు, "బలహీనుడి లాగా ఎందుకిలా మాట్లాడతావు? రావణుణ్ణి చంపి విభీషణుడికి పట్టం కడతానని ఇచ్చిన మాట నిలబెట్టుకోవద్దా? నా కోసం దిగులు పడి నిరాశ చెందక, రావణుణ్ణి యుద్ధంలో చంపెయ్యి," అన్నాడు.

లక్ష్మణుడిలా అనగానే రాముడు స్థిర చిత్తుడై విల్లు చేతబట్టాడు. ఈ లోపల రావణుడు కూడా మరొక రథమెక్కి యుద్ధ సన్నద్ధుడై వచ్చాడు. రాముడు నేల పైనా, రావణుడు రథం లోనూ ఉండి యుద్ధం ప్రారంభించారు.

అంతలో ఇంద్రుడి సారథి అయిన మాతలి దేవలోకం నుంచి ఒక దివ్యమైన రథాన్నీ, కవచాన్నీ, విల్లునూ, బాణాలనూ, శక్తినీ తీసుకుని రాముడున్న చోటికి వచ్చి, "రామా, దేవేంద్రుడు నీకోసం వీటినన్నిటినీ పంపాడు. ఈ రథంలో ఎక్కి నీవు రావణుణ్ణి వధించు," అని చెప్పాడు. రాముడా రథానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి అందులో ఎక్కాడు.

ఇద్దరూ ఒకరి పై ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు. ఒకరి అస్త్రాలను మరొకరి అస్త్రాలు నిర్వీర్యపరచాయి. కొంత సేపు రావణుడు అతి భయంకరంగా యుద్ధం చేసి, రాముడికి చెయ్యీ కాలూ ఆడకుండా చేశాడు. అతను వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని రాముడి పై ప్రయోగించే సరికి, రాముడు దాన్ని తన బాణాలతో నిరోధించ లేక, ఇంద్రుడు పంపిన శక్తిని ప్రయోగించి ఆ శూలాన్ని ధ్వంసం చేశాడు.

ఆ తరవాత రాముడు విజృంభించి యుద్ధం చేస్తూంటే రావణుడు ఉక్కిరి బిక్కిరి అయి ఆత్మరక్షణ కూడా చేసుకో

లేని స్థితిలో పడ్డాడు. అది చూసి రావణుడి సారథి తమ రథాన్ని యుద్ధరంగం నుంచి అవతలికి తోలుకు పోసాగాడు.

రావణుడికి తన సారథి పైన ఆగ్రహం వచ్చింది. "ఓరీ దుర్బుద్ధీ, నేను పిరికివాణ్ణా, అసమర్థుణ్ణా, అస్త్రాలు లేనివాణ్ణా, యుక్తిలేనివాణ్ణా? ఏమనుకుని నీ యిష్టం వచ్చినట్టు రథాన్ని యుద్ధరంగం నుంచి తోలుకు పోతున్నావు? నా కీర్తి కాస్తా ధ్వంసం చేశావే! నీకు శత్రువులేమన్నా లంచంపెట్టారా ఏమిటి? వెంటనే రథాన్ని వెనక్కు తోలు," అన్నాడతను తన సారథితో.

"మహారాజా, నీ మేలు కోరి, నా విధిని పాటించి రథాన్ని పక్కకు తెచ్చాను. రాముడు చేసే యుద్ధానికి నీవు ప్రతియుద్ధం చెయ్యటం లేదు. బ్రహ్మాండమైన యుద్ధం చేసి అలసిపోయి ఉన్నావు. గుర్రాలు కూడా డస్సి ఉన్నాయి. నీకూ వాటికీ కాస్త విశ్రాంతి లభించగలందులకు ఆపని చేశాను. రథం ఎప్పుడెలా నడపాలో తెలీకపోతే నేను సారథినే కాను. ఇప్పుడేం చెయ్యమంటావో చెప్పు, అలాగే చేస్తాను," అన్నాడు రావణుడి సారథి.

రావణుడు మెత్తబడి, తన సారథిని కాస్త పొగడి, "రాముడి కెదురుగా రథాన్ని





తీసుకుపో!" అని చెప్పాడు. కొద్దిసేపటిలో రావణుడి రథం తిరిగి రాముడి ఎదటికి వచ్చి నిలబడింది.

ఆ సమయంలో రాముడు కూడా అమితంగా అలిసిపోయి, రావణుడితో యుద్ధం చేసే శక్తి లేని స్థితిలో ఉన్నాడు. అది కనిపెట్టి, యుద్ధం చూడవచ్చిన అగస్త్యుడు రాముణ్ణి సమీపించి, "రామా, నీకు ఆదిత్య హృదయం చెబుతాను. అది జపించి, శక్తివంతుడవై రావణుడితో యుద్ధం చెయ్యి," అని రాముడికి ఆదిత్యహృదయం చెప్పాడు.

రాముడు దాన్ని మూడుసార్లు పఠించి, రెట్టింపైన బలం పొంది బాణం తీసుకుని రావణుడితో యుద్ధం సాగించటానికి ముందుకు వచ్చాడు.

అతను మాతలితో, "ఈసారి రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నీవు రథాన్ని చాకచక్యంగా నడుపు. దేవేంద్రుడి రథ సారథివైన నీకు విశేషం చెప్పనవసరం లేదు. ఏమాత్రం కూడా ఏమరుపాటు చెంద వద్దని జ్ఞాపకం చేస్తున్నానంతే!" అన్నాడు.

తన రథం మూలాన రేగిన దుమ్ము రావణుణ్ణి చుట్టుముట్టే లాగా మాతలి రథాన్ని రావణుడి కేసి తోలాడు. రావణుడు మండిపడి రాముడి పైన బాణాలు వేశాడు. రాముడు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధం ఆరంభించాడు.

రామరావణ యుద్ధం ఎంత తీవ్రంగా సాగిందంటే ఉభయ పక్షాల వీరులూ యుద్ధం మానేసి ఆ ద్వంద్వ యుద్ధాన్ని చూడసాగారు. ఇద్దరూ తమ పరాక్రమాన్ని పూర్తిగా ప్రదర్శిస్తూ, అదే తమ తుది పోరాట మన్నట్టుగా యుద్ధం చేశారు.

ఇలా రామ రావణులు మహా భయంకరమైన యుద్ధం చేస్తుండగా, రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణానికి రావ

ణుడి శిరస్సు తెగి నేలపైన పడిపోయింది. కాని, ఆ క్షణంలోనే రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది. రాముడు దాన్ని కూడా ఖండించాడు. అది కిందపడే లోపుగా రావణుడికి మరొక శిరస్సు కనబడింది. ఈ విధంగా రాముడు రావణుడి తలను నూటఒక్కసారి ఖండించి కూడా అతన్ని ఏమీ చెయ్యలేకపోయాడు. తన వద్ద ఉన్న అమోఘమైన బాణాలన్నీ రావణుడి పై ఎందుకు వ్యర్థమయాయో రాముడికి అర్థంకాలేదు.

ఆ రామ రావణులు ఆ విధంగా, క్షణం విశ్రాంతి లేకుండా, ఏడు రాత్రులూ, ఏడు పగళ్ళూ పోరాటం సాగించారు. చూసి చూసి మాతలి రాముడితో, "వీణ్ణి చంపెయ్యక ఎందు కిలా తాత్సారం చేస్తున్నావు? వీడి మీద బ్రహ్మస్త్రం ప్రయోగించు," అన్నాడు.

మాతలి ఆ మాట అనగానే రాము డొక మహాసర్పం లాటి బాణాన్ని పైకి తీశాడు. దేదీప్యమానంగా వెలిగే ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం తయారుచేశాడు. అది చాలా బరువైనది, ఈకలు గలది, వజ్రంలాగా అతి కఠినమై ఇతర ఆయుధాలను ఛేదించ గలది. రాము డా బాణాన్ని ఎక్కు



పెట్టి మంత్రించి రావణుడి పైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతని వీపులో నుంచి దూసుకుని బయటికి వచ్చేసింది. రావణుడు తన చేతిలో ఉండే ధనుర్బాణాలను వదిలేసి, ప్రాణాలుపోయి, రథం పై నుంచి నేల పైకి పడిపోయాడు.

అది చూసి హతశేషులైన రాక్షసులు పారిపోసాగారు. వానరులు చేతుల్లో చెట్లు పట్టుకుని, సింహనాదాలు చేస్తూ ఆ రాక్షసులను తరిమారు. రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. రాముణ్ణి భూమి పైన వానరులతో బాటు, ఆకాశం లోని దేవతలు కూడా



పొగడారు. రాముడూ, సుగ్రీవుడూ, అంగదుడూ కృతకృత్యులై చాలా సంతృప్తి చెందారు. ఇతర వానర ప్రముఖులూ, విభీషణుడూ రామ లక్ష్మణుల చుట్టూ మూగి వారిని ప్రశంసించారు.

తన అన్న పోయినందుకు విభీషణుడు బాధపడ్డాడు. ఒక్క సీతాపహరణ కారణంగా రావణుడు నాశనమయాడే గాని, అతను అనేక విధాల మహాపురుషు డనదగినవాడు; గొప్ప పండితుడు; నిష్ఠాపరుడు; అసమాన శౌర్య పరాక్రమాలు గలవాడు.

అన్న పోయాడని బాధపడుతున్న విభీషణుణ్ణి ఓదార్చుతూ రాముడు, "రావణుడు పిరికిచావు చావలేదు, వీరుడు లాగా పోరాడుతూ పోయాడు. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలు. ఎంతటి మహావీరుడైనప్పటికీ శత్రువు చేతిలో మరణం పొందవచ్చు. వీరమరణం పొంది వీరస్వర్గం అందుకున్న వాడి కోసం శోకించరాదు," అన్నాడు.

రాముడి అనుమతిపై విభీషణుడు తన అన్నకు శాస్త్రోక్తంగా దహనక్రియలు చేయబూనుకున్నాడు.

రావణుడు చచ్చాడని తెలియగానే అతని భార్యలు పెద్దపెట్టున ఏడుస్తూ, ఉత్తర ద్వారం కుండా వెలువడి, రావణుడి శవాన్ని వెతుక్కుంటూ వచ్చారు. చివరకు వా రతని శవాన్ని చూసి, దాని పైన పడి, గుండెలు అవిసే లాగా ఏడ్చారు; విభీషణుడు చెప్పినట్టు సీతను రాముడి కిచ్చినట్టయితే ఇంత దురన్యాయం జరిగేది కాదని ఆక్రోశించారు. "త్రిలోకాలనూ జయించి, దేవత లందరినీ అడలగొట్టి చివరి కొక మానవమాత్రుడి చేతిలో ప్రాణాలు వదిలావా ?" అని మందోదరి విలపించింది.

"ఈ ఆడవాళ్ళ నందరినీ ఇళ్ళకు పంపి నీ అన్నకు ఉత్తరక్రియలు చెయ్యి," అని రాముడు విభీషణుడితో అన్నాడు. దుర్మా

ర్గుడూ, అవినీతిపరుడూ అయిన తన అన్నకు తాను సంస్కారం చెయ్యటం యుక్తంగా ఉంటుందో ఉండదో నని విభీషణుడు ధర్మసందేహం లేవదీశాడు. యుక్తంగానే ఉంటుందని రాముడు చెప్పిన మీదట అతను అందుకు పూనుకున్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితి పేర్చి దాని పైన ఒక గొంగళి పరిచారు. రావణుడి శవాన్ని అలంకరించి చితి పైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి చిచ్చు పెట్టాడు. తరవాత అతను తడిబట్టలతో నీళ్ళు వదిలి, స్త్రీ జనాన్ని లంకకు పంపించి, రాముడి వద్దకు వచ్చాడు.

యుద్ధం చూడవచ్చిన దేవదానవ గంధర్వాదులు రామ పరాక్రమం గురించీ, వానరులు చేసిన యుద్ధం గురించీ మాట్లాడు కుంటూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. రాముడు మాతలిని గౌరవించి, అతన్ని రథంతో సహా స్వర్గానికి పంపేశాడు.

తరవాత రాముడు కృతజ్ఞతాపూర్వకంగా సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సహా శిబిరానికి వెళ్ళాడు.

అతను లక్ష్మణుడితో, "ఇప్పుడు వెంటనే జరగవలసిన ముఖ్యమైన పని విభీషణుణ్ణి లంకా రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యటం. ఆ పని వెంటనే జరిపించు," అని చెప్పాడు.

లక్ష్మణుడు వానరులకు సువర్ణకలశా లిచ్చి సముద్ర జలం తెప్పించాడు. అతను విభీషణుణ్ణి సింహాసనం పైన కూర్చోబెట్టి ఆ జలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతని పట్ల భక్తిగల రాక్షసులూ సంతోషించారు. విభీషణుడు తన ప్రజలకు నచ్చే మాటలు చెప్పాడు. రాక్షస పౌరులు అతనికి రకరకాల వస్తువులు కానుకలుగా అర్పించారు. విభీషణుడు కూడా రామ లక్ష్మణులకు దివ్యమైన వస్తువులను కాను కలుగా ఇచ్చాడు.






# సుదర్శనుడు

పూర్వం ధ్రువసంధి అనే సూర్యవంశపు రాజు అయోధ్య రాజధానిగా పెట్టుకుని కోసల దేశం ఏలేవాడు. అతనికి మనోరమా, లీలావతీ అని ఇద్దరు భార్యలు. మనోరమకు సుదర్శనుడూ, లీలావతికి శత్రుజిత్తూ అనే కొడుకులు కలిగారు. ఇద్దరు కొడుకులలోనూ శత్రుజిత్తు అధిక గుణవంతుడు కావటం చేత ధ్రువసంధికి అతని పైన ప్రేమ జాస్తిగా ఉండేది.

ఒకనాడు ధ్రువసంధి వేటకు వెళ్ళి ఒక సింహం వాతపడి చనిపోయాడు. అప్పుడతని మంత్రులు, పోయిన రాజుగారికి అభిమానపాత్రుడైన శత్రుజిత్తుకే రాజ్యాభిషేకం చేద్దామనుకున్నారు. లీలావతికి తండ్రీ, శత్రుజిత్తుకు తాతా అయిన యుధాజిత్తు ఈ ప్రయత్నాన్ని బలపరిచాడు.

అయితే మనోరమ తండ్రి అయిన వీరసేనుడు, తన మనమడైన సుదర్శనుడే చనిపోయిన రాజుకు జ్యేష్ఠ పుత్రుడు గనక రాజ్యాభిషేకం ఆ సుదర్శనుడికే జరగాలని పట్టుపట్టాడు. యుధాజిత్తుకూ వీరసేనుడికీ ఈ కారణంగా యుద్ధం కూడా సంప్రాప్తమయింది.

ఆ యుద్ధంలో మనోరమ తండ్రీ, సుదర్శనుడి తాతా అయిన వీరసేనుడు కాస్తా చచ్చి పోయాడు. అతని పక్షం ఓడి పోయింది. మనోరమ దిక్కులేనిదై, తన కొడుకు సుదర్శనుడితో సహా పారిపోయింది. గంగా తీరాన దొంగలు తటస్థపడి ఆమె వద్ద ఉన్న ధనమంతా దోచుకున్నారు. ఆమె వెంబడి ఆమె కొడుకూ, ఒక మంత్రీ ఒక దాసీ ఉన్నారు.

వీరు నలుగురు గంగ దాటి, త్రికూట పర్వతం దగ్గిరగా ఉన్న భరద్వాజాశ్రమం పక్కగా పోతూ ఉండగా, అక్కడ ఉండే ఒక ఋషి మనోరమను చూసి, "ఎవరు

అట్ట చివరి బొమ్మ

నీవు? ఎక్కడి కిలా పోతున్నావు?" అని అడిగాడు. మనోరమ తన మంత్రి చేత తన వృత్తాంత మంతా ఆ ఋషికి చెప్పించింది. ఆ ఋషి అంతా విని ఆమెను తమ ఆశ్రమంలో ఉండమని చెప్పి, ఎంతగానో ఆదరించాడు.

కొంత కాలం గడిచాక, శత్రుజిత్తు తాత అయిన యుధాజిత్తు సుదర్శనుణ్ణి చంపటానికి బోయవాళ్ళను వెంట బెట్టుకుని వస్తున్నట్టు మనోరమకు తెలియ వచ్చింది. ఆమె భయంతో ఏడుస్తూ వెళ్ళి భరద్వాజుడి కాళ్ళపైన పడింది. భరద్వాజుడామెను భయపడ వద్దని చెప్పి, యుధాజిత్తు తలపెట్టిన దుర్మార్గాన్ని నివారించ యత్నించాడు.

అయితే యుధాజిత్తు సుదర్శనుణ్ణి చంపటానికి పూర్తిగా సంకల్పించుకుని ఉన్నాడు; లేక పోతే తన మనమడైన శత్రుజిత్తు రాజ్యపాలన నిష్కంటకంగా ఉండదని ఆయన భయం. ఆ భయంతో యుధాజిత్తు భరద్వాజమహాముని ఆజ్ఞను ధిక్కరించటానికి సిద్ధపడ్డాడు. కాని ఆయన మంత్రులు అది తగదని సలహా ఇచ్చారు; పూర్వం విశ్వామిత్రు డిలాగే వశిష్ఠుడి కామధేనువును బలాత్కారంగా పట్టుకుని చెడి పోయాడని చెప్పారు.



ఆ కథ విన్న మీదట యుధాజిత్తు బెదిరిపోయి, భరద్వాజుడి కాళ్ళపై బడి ఆయన క్షమించానని చెప్పాక తిరిగి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

తరవాత సుదర్శనుడు ఆ ఆశ్రమంలోనే విద్యలన్నీ అభ్యసించి, భరద్వాజుడి వల్ల ఒక మంత్రం ఉపదేశం పొంది, దాన్ని పఠిస్తూ రాగా అది అయిదేళ్ళకు ఫలించింది. సుదర్శనుడికి పదకొండో ఏడు రాగానే ఉపనయనం చేసి అతడికి ధనుర్వేదమూ, నీతిశాస్త్రమూ నేర్పారు.

అతను వాటిని నేర్చుకుంటూ ఉండగా ఒకనాడు అకస్మాత్తుగా అతని ఎదట ఎర్రని పూలమాలలూ, ఎర్రనిబట్టలూ కట్టుకుని అంబ ప్రత్యక్షమయింది.

ఆమెను చూస్తూనే సుదర్శనుడు సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆమె అతనిని దీవించి, దివ్యమైన ధనుర్బాణాలను ప్రసాదించి అంతర్హితురాలయింది.

కొంత కాలం గడిచింది. ఒకనాడు కాశీ రాజైన సుబాహుడి కుమార్తె శశికళకు కలలో పార్వతి కనిపించి, "సుదర్శనుడు నీకు భర్త అవుతాడు," అని దీవించింది. దాని ఫలితంగా శశికళకు సుదర్శనుడి పైన అంతు లేని ప్రేమ పుట్టుకొచ్చింది. కాని ఆమెకు సుదర్శను డెవరో తెలియలేదు.



ఆమె సుదర్శనుణ్ణి గురించి విచారించగా అతను ఫలాన దేశపు రాజకుమారు డని తెలియవచ్చింది. అమెకు ప్రేమతో బాటు విరహం కూడా కలిగింది.

ఆ సమయంలో శృంగిబేరపుర రాజు సుదర్శనుడి దుస్థితి గురించి విని అతని కొక రథం ఇద్దామని భరద్వాజాశ్రమానికి వచ్చాడు. అప్పుడా ఆశ్రమంలో ఉండే మునులు, "ఈ కుర్రవాణ్ణి నీ వెంటనే తీసుకుపో," అని శృంగిబేరపుర రాజుతో అన్నారు. సుదర్శనుడు ఆ రాజు వెంట శృంగిబేరపురానికి వెళ్ళిపోయాడు.

త్వరలోనే శశికళకు స్వయంవరం ఏర్పాటు చేశారు. స్వయంవరానికి సుదర్శనుడు కూడా వెళ్ళాడు. శశికళ వరమాల చేత బట్టుకుని, ఏ రాజకుమారుడి కేసీ చూడనైనా చూడకుండా తిన్నగా సుదర్శనుడి వద్దకు వచ్చి, వనవాసి అయిన అతని మెడలోనే మాల వేసి వరించి, పెళ్ళాడింది.

సుదర్శనుడు తన రథంలో తన భార్యను వెంటబెట్టుకుని అయోధ్యకు బయలుదేరి వస్తూండగా, అతని తమ్ముడైన శత్రుజిత్తు సముద్ర మంత సేనను వెంట తీసుకుని అతన్ని ఎదుర్కొన్నాడు. భయంకరమైన యుద్ధం జరిగింది. అంత సేనతో ఒంటరిగా పోరవలసి వచ్చేసరికి సుదర్శనుడు అంబను స్మరించాడు. వెంటనే అమె సింహవాహన మెక్కి శత్రువుల మధ్య ప్రత్యక్షమై, దివ్యాస్త్రాలు కురిపించి, శత్రుజిత్తునూ అతని సైన్యాలనూ చించి చెండాడింది.

తరువాత సుదర్శనుడు భార్యా సహితుడై అయోధ్య చేరి, శత్రుజిత్తు తల్లి అయిన లీలావతిని ఓదార్చి, వైభవంగా రాజ్యాభిషేకం చేసుకున్నాడు. అతను అంబకు ఒక సువర్ణ విమానం చేయించి అందులో అమెను ప్రతిష్ఠించి, నిత్య పూజలూ, నవరాత్రి ఉత్సవాలూ జరిపించి, ఆ దేవి దయకు పాత్రుడయాడు.



# 42. యున్‌కాంగ్ గుహలు

మన దేశంలో అజంతా, ఎల్లోరాల లాగానే చీనా లోని యున్‌కాంగ్ గుహలు శిల్పాలకు ప్రసిద్ధికెక్కినవి. బౌద్ధ శిల్పాలు వేల సంఖ్యలోగల ఈ గుహలను దాదాపు 1500 ఏళ్ళ క్రితం ఉత్తరవేయి రాజులు నిర్మింపజేశారు. ఈ గుహలు తూర్పు షాన్సీ రాష్ట్రంలో ఉన్నాయి. ఈ గుహల సంఖ్య 30.



Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేత్ర పర్వం

పంపినవారు:
ఎ. ఎస్. మూర్తి, గుంటూరు

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేర్పరి తనం

పంపినవారు :
ఎ. ఎస్. మూర్తి, గుంటూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 జులై నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నేత్ర పర్వం

రెండవ ఫోటో : నేర్పరి తనం

పంపినవారు : ఎ. ఎన్. మూర్తి, c/o శ్రీ ఎ. ఎల్. రావు, ఇంజనీరు

గుంటూరు.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## పాటలు పాడే బొమ్మలతో

### చిన్న పిల్లలకు పుస్తకం

రంగు రంగుల అందమైన బొమ్మలతో చిన్న పిల్లలకు విద్యాబోధన చేయడమనే అంశం క్రొత్తదేమీ కాదు. ఈ బొమ్మలకు తోడు రకరకాల ధ్వనులు. ఆ ధ్వనులను చేసే బొమ్మలు వుంటే చిన్న పిల్లలు ఇంకా త్వరగా అక్షరాలు, మాటలు నేర్చుకొన గలుగుతారు.

సంగీతయుక్తంగా పాటలు పాడుతూ, రకరకాల ధ్వనులు చేసే బొమ్మలను, ఆ బొమ్మలకు సరిపడే అక్షరాలను కలిగిన అందమైన చిన్న పిల్లల పుస్తకం ఒకటి మా కార్యాలయం చేరింది. 'అ' మొదలు 'అః' వరకూ అక్షరాలు ఇందులో వున్నాయి. ప్రతి పేజీని చేతితో నొక్కితే రకరకాల ధ్వనులు వినిపిస్తాయి. పాఠశాలకు రేపో, మాపో వెళ్లనున్న పిల్లలకు ఇది ఎంతో ఉపకరిస్తుంది. ఈ పుస్తకంతో ఆడుకొంటూ, బొమ్మలవైపు పదే పదే చూడడంవల్ల చిన్న పిల్లల మెదడులో అక్కడి అక్షరాలు బాగా నాటుకపోయి బాగా గుర్తుంటాయి.

ఈ పుస్తకం అధునికంగా వుంది. ఇన్ని చక్కని ఆకర్షణలు కలిగిన పిల్లల పుస్తకం రావడం తెలుగులో ఇదే ప్రథమం.

వెల రు. **1-50**

హిగ్గిన్‌బాదమ్స్ ప్రైవేటు లి.
**165,** మౌంటు రోడ్డు, మద్రాసు-2.

# ఊరగాయ పచ్చళ్లకు
# అమూల్యమైన నూనెలు

అగ్‌మార్కు కాబడిన
ఏ.యస్.బ్రాండ్
**చాయపప్పు నూనె**







అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్
**నువ్వుల నూనె**

ముక్కను మెత్తబడనీయవు........
బూజుపట్టనీయవు..............
చాలకాలము నిలువయుంచును.
16, 4, 2. కిలోగ్రాంల డబ్బాలలో
పేకింగు చేయబడుచున్నవి....
ఇండియన్ గవర్నమెంటువారి అగ్
మార్కు సీలును గమనించికొనుడు.

డిస్ట్రిబ్యూటర్సు :
శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమిషను మర్చంటు;
శివాలయం వీధి, విజయవాడ.
ఫోన్ నెం. 567

శ్రీ బచ్చు రామకృష్ణయ్య
చీదెళ్ళ పెదనాగయ్య,
జనరల్ మర్చంట్సు,
నంద్యాల

MFRS, అంబటిసుబ్బన్న&కో. సామర్లకోట

